3-4-5

సాహిత్య మాసపత్రిక




* మల్లాది రామచంద్రశాస్త్రి
* ముదివేడు ప్రభాకరరావు
* ఎ. హనుమంతప్ప
* ఇలపావులూరి పాండురంగారావు
* కీర్తి నాగరాజు

శిష్టా లక్ష్మీనరసమ్మ

* ఇంద్రగంటి పతంజలిశాస్త్రి
* కేతవరపు రామకోటిశాస్త్రి
* డా॥ హెచ్. ఎస్. బ్రహ్మానంద

# డా॥ ఏ. బి. నాగేశ్వరరావుగారి నిర్యాణము

ప్రముఖ స్వాతంత్ర్యయోధులు, ప్రజాసేవకులు, ఆంధ్ర రాష్ట్ర మాజీ అమాత్యులు మీదు మిక్కిలి రాజమహేంద్రవరం హిందీ ప్రేమీమండలి అధ్యక్షులుగాను, దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర మరియు కేంద్ర కార్యనిర్వాహక వర్గ సభ్యులుగాను కేంద్ర సభ కార్యవర్గ అధ్యక్షులుగాను, ఆంధ్రప్రదేశ్‌లోనూ, మొత్తం దక్షిణాదిలోనూ హిందీ ప్రచార ప్రసారములకు తోడ్పడి ఎనలేని సేవ చేసిన డా॥ఏ.బి. నాగేశ్వరరావుగారు ది. 6-11-82న రాజమహేంద్రవరంలో నిర్యాణము చెందినారు. వారి నిర్యాణమునకు ఆంధ్ర సభ మరియు ఆంధ్రప్రదేశ్ నందలి హిందీ ప్రచారకులు ప్రగాఢ సంతాపమును ప్రకటించుచు, వారి ఆత్మకు శాంతిని ప్రసాదింపమని పరమేశ్వరుని ప్రార్థించుచున్నారు.

# శ్రీ జి. సుబ్రహ్మణ్యంగారి నిర్యాణము

తమిళనాడులోనూ, ఇతర రాష్ట్రాలలోనూ, హిందీ ప్రచార రంగమున అనేక పదవులలో పనిచేసి ఆంధ్ర సభ కార్యదర్శిగాను తరువాత కేంద్ర సభ ప్రధాన కార్యదర్శిగాను పనిచేసి పదవీ విరమణ చేసిన శ్రీ జి. సుబ్రహ్మణ్యంగారు ది. 25-11-82న మద్రాసులో స్వర్గస్థులయినారు. వారి నిర్యాణమునకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, మరియు ఆంధ్రప్రదేశ్ నందలి హిందీ ప్రచారకులు ప్రగాఢ సంతాపమును ప్రకటించుచు, వారి ఆత్మకు శాంతిని ప్రసాదించుమని పరమేశ్వరుని ప్రార్థించుచున్నారు.



సాహిత్య మాస పత్రిక

# 345

డిసెంబర్ 1982

సంపుటి : 29, సంచిక : 9

వార్షిక చందా : పది రూపాయిలు

విడి ప్రతి : ఒక రూపాయి

సంపాదకులు :

డా. సి. నారాయణరెడ్డి

వేమూరి ఆంజనేయశర్మ

చిర్రావూరి సుబ్రహ్మణ్యం

# ఈ సంచికలో

సంపాదకీయం :

# ఆచార్య వినోబాభావే నిర్యాణము

మహాత్మాగాంధీగారి ఆధ్యాత్మిక వారసుడని, భూదాన యజ్ఞ ప్రవర్తకుడని, హృదయ పరివర్తనం ద్వారా లోకమన్, తహసీల్‌దార్‌సింగ్ వంటి బందిపోటు నాయకులను సాధు పురుషులుగా మార్చిన మానవతా సాధకుడని ప్రసిద్ధినందిన ఆచార్య వినోబాభావే ప్రాయోప వేశమార్గాన దేహత్యాగం చేశారు. వారి నిర్యాణంతో 1920 ప్రాంతాల్లో గాంధీగారు భారత స్వాతంత్ర్యోద్యమంలో చేరటంతో ప్రారంభమయిన యుగం సమాప్తి చెందినట్లయింది. గాంధీ మహాత్ముడు, ఆయనతో ప్రారంభమయిన యుగం-వీటికి ప్రధానమైన రెండు లక్ష్యాలున్నాయి. మొదటిది స్వాతంత్ర్య సాధనకాగా ఆసాధించిన స్వాతంత్ర్యాన్ని దేశంలోని అట్టడుగు మానవునికి కూడ ఉపభోగ్యం చేయటం రెండవ లక్ష్యం. నిజానికి దేశ స్వాతంత్ర్య సాధనకు అనేకులు అనేక పద్ధతులలో ప్రయత్నాలు చేశారు. కాని వాటన్నిటిలోను గాంధీగారు అనుసరించిన అహింసాయుత మార్గానికి ఎక్కువ ప్రశస్తి లభించింది. దేశం స్వతంత్రమయింది. పరిపాలనాధికారం గాంధీజీ అనుయాయులనబడే వారి చేతులలోకి వచ్చింది. అయినా ఆ స్వాతంత్ర్యం లభించిన తీరు ఫలితంగా జీవితమంతా సత్యాహింసల సాధనలో గడిపిన మహాత్ముడు హింసకు బలికావలసి వచ్చింది.

స్వాతంత్ర్యానంతరం పాలనాధికారం గాంధీ మహాత్ముని అనుయాయులనబడే వారికి వచ్చినా గాంధీజీ ప్రవచించిన స్వరాజ్యం-సురాజ్యం-మాత్రం ప్రజలకు లభించలేదు. అందువలన పరిపాలనకు దూరంగా ఉన్న మహాత్ముని అనుయాయులు సర్వోదయసంఘం పేరిట సంఘటితమై స్వరాజ్యాన్ని సామాన్య మానవుల వద్దకు తీసుకురావడానికి కృషి సల్ప నారంభించారు. ఇటువంటి గాంధీవాదుల కందరకు మార్గదర్శకత్వం వహించిన నాయకుడు ఆచార్య వినోబా భావే.

గాంధీ మహాత్ముని నుండి లభ్యమయిన దీక్షకు స్వీయసాధన తోడుకాగా వినోబాకు ఒక విలక్షణమైన ఆత్మశక్తి సమకూడింది. ఆత్మశక్తి కారణంగా ఆయన తన భూదానయజ్ఞ సంకల్పానికి ఆచరణ రూపం కల్పించడమేగాక సంపత్తిదాన గ్రామదాన రూపంలో దానిని అత్యంత విశాలమైన గ్రామ స్వరాజ్యోద్యమంగా దేశం ముందుంచారు. సత్యాహింసలు మూలాధారంగా త్రివిక్రమించిన ఆచార్య భావే మహోద్యమం ఒక దశలో ప్రపంచంలోని అనేక దేశాల మేధావులను ఆశ్చర్య సాగరంలో ముంచెత్తింది!

ఇంతయినా వినోబాజీ ప్రారంభించిన ఈ ఉద్యమం తన గమ్యాన్ని చేరుకోలేక పోయింది. కారణాలేమయినా ఉద్యమం నిలిచిపోయింది. సర్వోదయ నాయకులలో అభిప్రాయ భేదాలు వచ్చాయి. గాంధీ మహాత్ముని శిష్యుడుగా ఆయన ఏ సత్యాహింసలను, ఏ యితర నైతిక విలువలను, కార్యక్రమాలను దేశం ముందుంచాడో అవి క్రమంగా తిరస్కృతాలయి నాయి. మతకలహాలు విజృంభించాయి. ఎక్కడ చూచినా అసత్యం, హింస, అనైతికత తాండవం చేస్తున్నాయి ఈ పరిస్థితుల ప్రభావం వినోబాపై ప్రసరించలేదని చెప్పలేము. ఆ కారణంగానే ఆయన ప్రాయోపవేశం ద్వారా దేహత్యాగం చేయడానికి నిశ్చయించారని చెప్పవచ్చును.

మన ప్రాచీన గ్రంథాలలో ప్రాయోపవేశాన్ని గూర్చి వర్ణించిన సందర్భాలు చాలానే ఉన్నాయి. ప్రాయోపవేశం ప్రముఖంగా వర్ణింపబడిన సందర్భాల్లో ఆయా వ్యక్తులు లక్ష్య సాధనలో విఫలులై నిరాశానిస్పృహలకు లోనై ప్రాయోపవేశాన్ని సంకల్పించినట్లు మనకు కనబడుతుంది. రామాయణంలో అంగదాది వానరులు సీతాన్వేషణలో విఫలురై నిరాశతో సముద్ర తీరాన ప్రాయోపవేశానికి సమకట్టినట్లు వర్ణితమైంది. మహాభారతములో దుర్యోధనుడు గంధర్వులచే విజితుడై పాండవులచే ఉద్ధరింపబడి అవమాన భారంతో ప్రాయోపవేశానికి పూనుకుంటాడు. భారత యుద్ధానంతరం భీష్మ నిర్యాణం, అంతర్విరోధాలతో యాదవుల నాశనం తరువాత శ్రీకృష్ణుని దేహత్యాగం, పాండవుల వారసుడు పరీక్షన్మహారాజు మరణం ఇవన్నీ ప్రాయోపవేశం క్రిందకే వస్తాయి. ఈ విధంగా ఈ మహాపురుషులందరి ప్రాయోప వేశంలోను కొట్టవచ్చినట్లు కనబడేది జీవితవైఫల్య జన్యమయిన నిరాశ.

ఏమయినా వినోబాజీ ప్రారంభించిన ఈ మహత్తర కార్యాన్ని ముందుకు తీసుకుపోగల మని చెప్పే స్థితిలో ఇప్పుడు మనంలేము. అంతటి ఆత్మశక్తి సంపన్నుడు. సమర్థుడు దేశంలో ఎవడూ లేడు. సత్యాహింసలను వ్యక్తిగత సాధనా పరిధినుండి వెలువరించి వాటిని వివిధ సాంఘిక జీవిత మార్గాలలో పయనింపజేసి గాంధీ మహాత్ముడు, ఆచార్య వినోబా భావే వాటికి కల్పించిన విశ్వరూపం వినోబాజీ దేహత్యాగంతో తిరోహితమై పోయింది.



# ఋతుచక్రము

మల్లాది రామచంద్రశాస్త్రి

శ్రీకరములు సంపదాకర నవసుధా
శీకరములు జన వశీకరములు
చిన్నికృష్ణునలరు చిన్నారి చూపుల
సిరులు జగతికొసగు చిరసుఖమ్ము

మాసములను నేను మార్గశీర్షమనని
నందసుతుడు దివ్యసుందరుండు
గీతలో వచించె చేతము నలరించు
మార్గశిరము దివ్యమార్గదర్శి

ఆప్తమిత్రముగను నలరించునన్ను దా
మహితగతిని వచ్చు మార్గశిరము
చూతవృక్షవితతి చేతము నలరించు
పూత పరిమళమున; పూతపూచి.

హిమదుకూలయౌచు హేమంత మరుదెంచు
బంతిపూలు నూకబంతిపూ ॥.
వింతశోభ గూర్చ నింతులందరు పూల
బంతులుగను ధర వి-భాసమాన.

మాఘఫాల్గునములు మహితములయ్యును
శిశిరఋతువవౌచు శీర్ణగతిని
వృక్షతతుల కొంత విక్షుబ్ధ మొనరించి
కని వసంతు, వాని కలిమిపెంచు.

చివురు జొంపములను చిత్తము నలరించు
శిశిర తనయు రాక శ్రీకరమ్ము
పికరుతమ్ము శ్రవణసుఖదాయి, కడుహాయి
నవవసంతురాక నాకమవని

గ్రీష్మమెంతయేని భీష్మమ్మదౌగాక
తాపమంది దివ్యతపమొనర్చు
తరణిగూర్చి ధరణి; ధన్యతగనె నన
వర్షదరుగుదెంచి హర్షమొసగు

నీలనీరదములు నింగి నాక్రమణము
సల్పి ధరణికిడు ననల్పసుఖము
తరుణమరుగుదెంచు తపము ఫలింపగా
నూర్జితములువోవ వూరక భువి-

ఋతువులందు జగతి ఋతురాజము వసంత
ఋతవుగాని; కవి ఋతమ్ము వల్కు-
చక్రవర్తిజేసె శరదిందు చంద్రికా
వైభవము "శరత్తు" ప్రాభవమిది.

ఋతము ధర్మయుతము ఋతుచక్రమువనిని
క్రమము తప్పబోదు గమనమందు
ఋతువు లాకులౌచు ఋతుచక్రమందున
తిరుగుచుండు సతము గిరగిరగిర.

వింతవింతలౌ ననంతగ్రహమ్ముల
ఋతువులేమొ; వాని ఋతుమదేమొ;
విశ్వమంతుగనని వింతయంత్రమ్ముగా
జ్ఞానేత్రమునకు కానిపించు.

"ఋతురాజో వసంతశ్చ
ఋతు సమ్రాట్ శరస్సహి।
చంద్రికా విభవం యస్య
సమ్రాట్ సహి వినిశ్చయః॥"

విజయసాహితి, విశాఖపట్టణం.

# అనార్ద్రఘటం

ముదివేడు ప్రభాకరరావు

ఒకప్పుడు నీవు ఉత్తుంగహిమాలయ శిఖరానివి!
ఇపుడు మొత్తంగా యిసుకలో యింకిపోతున్న నదివి!!
ఒకనాడు నీవు గంభీరంగా గర్జించే ప్రావృషేణ్య పయోధరానివి!
ఈనాడు దూదిపింజల్లా తేలిపోతున్న తెల్లని మబ్బుతునకవి!!
ఒకరోజు నీవు నవనవోన్మేష నందనవనానివి!
ఈరోజు వసంతంలోనే వట్టిపోతున్న చెట్టువి!!
ఒక దినం నీ విశాలహృదయాకాశంలో నిస్సీమంగా తాండవించిన భావన
ఈనాడు నేలబారుగా పిపీలికలై పారాడుతోంది!
సహృదయత, సౌహార్ద్రతలకు అర్థం లేదు నేడు!
అనార్ద్ర శుష్కకాష్ఠాలకే పట్టాభిషేకం చూడు!!
నీవు జీవితకావ్యాన్ని చదివి కన్నీళ్ళు కార్చావా-
మొసలి కన్నీళ్ళంటారు వెంటనే!
కాదు, పట్టుదలతో పట్టినపని సాధించావా-
మొండిఘటమంటారు నిన్నే!
'సూక్ష్మంలో మోక్షం సాధించాలోయ్'
ఓ ఉచితసలహా పారేస్తారు నీ మొఖాన్నే!
"శరీరం ఓ ఘటమనీ
అందులో ఆర్ద్రత వుండాలనీ
అదిలేని జీవితం రసార్ద్రత లేని
కావ్యంలా వ్యర్థమనీ ఎందుకనుకోరు?
ఆధునిక మానవుడే ఓ అనార్ద్రఘటం!
అధునాతన నాగరికతే వాడికో గుణపాఠం!!"
ఓహో! ఇది నీ స్వగతం కాబోలు!
మరి నా ప్రశ్నకు సమాధానం?
అందుకే అడుగుతున్నాను మళ్ళీ-
"అలనాడు అఘటన ఘటనా సమర్థులనే ఎదుర్కొని నిల్చిన నీవు
ఈనాడు యీ అగణిత అనార్ద్రఘటాలతో ఎలా వేగుతున్నావు?"

తెలుగుశాఖ,
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం - 515002

# చపల చిత్తులు

ఎ. హనుమంతప్ప

క. వైనమున యన్ని శిలలను
మైనముగా జేయవచ్చు మహిలో నైనన్
హీనమనుష్యుని మనసును
మైనముగా జేయలేము మంచి నుడులతోన్.

క. బండలను దున్ని పంటలు
పండించగలము శ్రమపడి బాహూబలమునన్
చండాల కొండెగాండ్లిలఁ
గొండలకంటె కఠినంబు కుత్సితబుద్ధిన్

గీ. మేడ నిర్మించవచ్చును మింటనైన
ఉర్వి నించుక తాకక నుండునట్లు;
భేలుఁడి మనసు సరిజేయ వీలుకాదు,
యత్నమంతయును వృథాప్రయాసగాదె!

గీ. గాలి నీదగలము చాల కష్టపడిన
నీటనైన నడువవచ్చు నేర్పుతోడ
కుయి[1] మదిని మార్చగారాదు కూర్చరాదు
శతవిధాల యత్నంబు నిష్ఫలముగాదె!

గీతమాలిక :

గగనమున పక్షిజాడను గానవచ్చు;
చేపజాడ జలమునైన జేరవచ్చు;
నల్లచీమ నడకనైన-నల్లబండ
రాతిపై రేయిఁగనవచ్చు శ్రద్ధతోడ;
ఆకసంబున తారకలన్ని- లెక్క-
గట్టవచ్చును మిక్కిలి కష్టపడిన:

1. నిజ జీవితములో గొప్పగా నటనచేయువాడు.

ఇద్దరిసతుల నెట్లైన నేలవచ్చు; [2]
చెలిమి మూర్ఖులతోఁ జేయ చేతకాదు

గీ. అగ్నినైన బట్టగవచ్చు హస్తమందు
త్రావవచ్చు నొక్కుడుట సంద్రజలమైన
అశ్వవాలచలనమైన నాపవచ్చు
ఖలుడిమది మార్చుటకాదు విధికినైన

ఆ.వె. ధనఋణధృవము[3] లను ధర్మార్థ మెఱుగక
గజిబిజిగ లిఖించు కవిత లోకుడు[4]
కావ్యగుణ మరయునె కాసింతయైనను
అంతరార్థ మెఱుగునా ఖలుండు!

గీతమాలిక :

ఆట్టలన్ గూర్చి చెప్ప నత్యల్పబుద్ధిఁ
బిలుపురాదని పల్కెను వెతలుజెంది
పిలుపురాకనె పండాకువలె పడునట
అసలు దీని భావము నతడరయగలడె?
స్థూలసూక్ష్మసువాసనల్ జూచి- పిల్చు
విధము మూర్ఖుడేమితెలియు పిచ్చిగాని
కుక్కతోక వంకర సరిగూర్చగలమె!
పిడుదు పాల్గ్రోలునె పొదుగు నడుమనుండి!?

క. తెలుపునదేమో తెలుపుడు
తెలుపుట నీధర్మ, మింకఁ దెలియకనున్నన్
ఇల ఖలునికర్మ మన్నా
డు- లోకనాథుడు, ఖలు డెపుడు తెలియగలడో!!!?

-తెలుగుశాఖ,
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యా
అనంతపురం - 3.

2 సతులిద్దరైన జగమల్లాడును; ముసలామెను గూడిన పగలే చుక్కలు కనబడునన్నాడు ఓ కవి

3. ధనధృవము = పాజిటివ్ (+; ఋణధృవము = నెగటివ్ (—) ప్రపంచమంతా ద్వాద్వాత్మకం. భగవంతుడు —భక్తుడు; గురువు—శిష్యుడు; భర్త—భార్య; ప్రకృతి—పురుషుడు.— రామాయణ కథలో రహస్యం ద్వాద్వాత్మకతకు సంబంధించింది కూడా వుంది. సీత ప్రకృతికి సంకేతం. రాముడు భగవంతుడు కదా! ఈ పురుషుడు భగవంతునికి సంకేతం ఈ ద్వంద్వాత్మకమే సృష్టిమర్మం. అదే +, —

4. కవిగాని గాని వాని వ్రాతయు— నవరస భావములు లేని నాతులపలపు... వృథరా సుమతీ అన్నాడు సుమతీశతక కర.

# అన్నా పోతన్నా

—ఇలపావులూరి పాండురంగరావు

అన్నా పోతన్నా నీవన్నమాట నిజమన్నా
కొండలాంటి గుణమన్నా పండులాంటి పలుకన్నా
పరమ సత్యపద భాసుర భాగవతోపన్యాసుడు
వాసుదేవ ధీవిలాస వరనివాసు డావ్యాసుడు
తెలిసి పలికె భాగవతము తెలియపరచితివి దానిని
తెలివితేటలకు అందని తొలివెలుగును వెలయించుచు
ఆ పదములు విన్నవాడు ఆ వెలుగును కన్నవాడు
పలుకలేడు - పలుకులకా పరమార్థము పట్టుబడదు
తెలియలేక - తెలిసికూడ పలుకలేక తికమకలయి
కవులు మునులు కననేరని ఘనత నీకు తెలుసన్నా

అన్నా పోతన్నా నీవన్నమాట నిజమన్నా
కొండలాంటి గుణమన్నా పండులాంటి పలుకన్నా

నీ కవితా మందారము మాకు మధుర మకరందము
పంచిపెట్టె, మామనసులు పండె, నిండె మా యెదలు
కవిత నీకు ఘనతకాదు కైవల్యము నీ ధ్యేయము
శ్రీపదమే కైవల్యము శ్రీహరి కైవల్యవాసి
శ్రీతత్త్వము శివతత్త్వము శ్రీ శివాత్మకముగ నెంచి
శ్రీకృష్ణుని లీలలతో చేరితివా కైవల్యము
ఆ శ్రీకైవల్యపదము నభిలషించియే లౌకిక
భోగభాగ్యములను వదలి భాగవతము భాషించుట

అన్నా పోతన్నా నీవన్నమాట నిజమన్నా
కొండలాంటి గుణమన్నా పండులాంటి పలుకన్నా

అల గంగాతీరములో ఆ పున్నమినాటి రేయి
పరమశివుని కొలువ రామభద్రుడు ప్రత్యక్షమయ్యె

ఆరాముడు హరికీర్తిని నోరునొవ్వ నుడువుమనుచు
చెప్పి క్షణములోన సత్యశివసుందరసార మొసగె
పరమేశ్వరరామకృష్ణవరములు నీ పదములయ్యే
నీ మదిలో సత్యపరం ధీమహిశూన్యమును నింపె
అదియె శూన్య మదియె పూర్ణ మదియె సత్య మదియె పరము
అదియె భక్తి రక్తి శక్తి అదియె సకల ముక్తి నొసగె

అన్నా పోతన్నా నీవన్నమాట నిజమన్నా
కొండలాంటి గుణమన్నా పండులాంటి పలుకన్నా

క్షణభంగుర సుఖములకయి శాశ్వతసుఖమును మరచి
రాజభోగములకు వలచి రమ్యహర్మ్యములకు భ్రమసి
సారస్వత వాణిజ్యము సాగించుట కియ్యకొనని
సాత్త్విక సత్కవివి నీవు సాటిలేరు నీకెవ్వరు
నీభక్తుల నోట నిలచి నీ పలికిన పలుకులెల్ల
తెలుగువారి పలుకులలో నిలిచిపోయినవి నేటికి
కలకాలము తెలుగుబాట వెలయించును నీ మాటలు
కవిత సరిత సవితలాంటి కమ్మని చల్లని వెలుగయి

అన్నా పోతన్నా నీవన్నమాట నిజమన్నా
కొండలాంటి గుణమన్నా పండులాంటి పలుకన్నా

పలికితివవతారకథలు పలుమారులు పలుతావుల
నీ హరివలె నీవుకూడ నేర్చితి వవతార విద్య
ఏభక్తుని కథచెప్పుదు వా భక్తుడ వవుదువీవు
ఒకపరి ప్రహ్లాదునివలె ఒకపరి గజరాజు పగిది
ఇది కథయని కావ్యమ్మని మదినెంచక పరవశించి
భక్తుల హృదయమున చేరి భగవంతుని కీర్తింతువు
నీకు పునర్జన్మలేదు నీకు జరయు మృతియులేదు
అజరామరమయిన రచన ఆంధ్రమహాభాగవతము
అన్నా పోతన్నా నీవన్నమాట నిజమన్నా
కొండలాంటి గుణమన్నా పండులాంటి పలుకన్నా

డైరక్టర్(హిందీ)
యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్
న్యూఢిల్లీ

# గుండె సెగలు

-కి రి నాగరాజు

ఒకే తల్లి బిడ్డలమైన ఒకరి మేలు వొకరు చూడలేము
ఇరుగు పొరుగు వాళ్ళమైన ఒకరి కులం వొకరు ఎంచకుండా బ్రతకలేము
విజ్ఞానం ఆకాశం లోతులు చేరుతున్న
మా హృదయాన్ని ఎద్దులా పచ్చనోట్ల గానుగ చుట్టే తిప్పుకుంటాం
రాచబాటలు పాడయిపోతుంటే పట్టించుకోము
కాని అడ్డదారుల్లో ఒకరికి మించి మరొకరు వెనకేసుకోవటంలో బాగా పోటీపడతాము
దొరబాబులు ఎక్కడ ఏ ఘోరం జరిపిన వారి గౌరవ మర్యాదలకు
భంగపాటు రానివ్వము కావాలంటే రక్షణ కోసం చట్టాన్నైన మారుస్తాం
ఏపూట కాపూట చేయి తడుముకొనేవాళ్ళు మనసిచ్చుకొన్నా
మమత పెనవేసుకొన్నా సహించకపోవడమే గాదు
నానా చిత్రహింసలపాలు చేయక తప్పము
దేశంలో జనాభాలాగే మా ప్రణాళికల్లో ప్రగతి పథకాలు పేరుకొనివున్నాయి
ఎన్నికల్లో గెలిచిన మంత్రిగారికి మొదట ముగించుకోవలసిన
సవాలక్ష స్వంత కార్యాలతోటే వున్న వ్యవధి గడవగా
ప్రగతి కార్యాలు మాత్రం అలాగే నిలిచి వుంటాయి
మేము నూరుదేవుళ్ళను పూజిస్తాము
వేయి బాబాలను పోషిస్తాము
కడకు చిలకశాస్త్రం చెప్పే వాడికి కూడ చేతినిండా డబ్బులిచ్చి గౌరవిస్తాం
కాని ముష్టెత్తుకొనే వాళ్ళను ఇంటిముందుకు రానివ్వము
చావు పరిస్థితిలో వుండి చందాలడిగిన చేయి విదల్చము
మాటలతో మామిడికాయలనే రాలుస్తాము
పాటలతో పున్నమివెన్నెలనే సృష్టిస్తాము
చేతలతో చిన్నిమొక్కనైనా చిగుర్చలేము
చొరవతో చిఱు చీకటినైన ఛేదించలేము

Tailor Street,
C. B. Bellary-583102

# స్త్రీల రామాయణపు పాటలలో సీతమ్మ

—శిష్టా లక్ష్మీనరసమ్మ

భారతీయ సాహిత్యము నందు శ్రీమద్రామాయణ మునకు గల విశిష్టత ఎనలేనిది. రామాయణ మహా కావ్యమును వాల్మీకి మహర్షి 'పాఠ్యేగేయేచ మధురమ్' అనురీతిని గానానుకూలముగ కూడ రచించుటయే ఈ విశిష్టతకు కారణముగ భావింపవచ్చును. భారతీయ భాషలయందేగాక భారతీయేతర భాషల యందును రామాయణము ఖ్యాతిగాంచినది రామాయణము తెలుగున వివిధ సాహిత్య ప్రక్రియల యందును అవత రించినది.

తెలుగు సాహిత్యము నందు జానపద సాహిత్య మొక ప్రముఖ స్థానమును సంపాదించగా అందు స్త్రీల పాటలు మరింత విశిష్టస్థానము నాక్రమించినవి. స్త్రీల పాటల యందు వారి కష్టసుఖములు, ఆచార వ్యవహారములు, సంప్రదాయములు, ఆశలు, ఆశయ ములు మున్నగు సర్వవిషయములును విపులీకరింపబడి యుండును.

స్త్రీల పాటల యందు పురాణేతిహాసముల కధిక ప్రాధాన్య మీయబడినది. అందునను ఆదికావ్యమగు రామాయణమునకు వారొసంగిన ప్రాధాన్యము తులలేనిది. 'స్త్రీల పాటలకు రామాయణము అంది వచ్చినంత సులువుగా తక్కిన పురాణాలు అందిరావు. మానవ హృదయస్పర్శ రామాయణంలో ఉన్నంతగా తక్కిన గాథలలో ఉండదు'[1] కావుననే హృదయ వాదులగు స్త్రీ సారస్వత నిర్మాతలు రామాయణమునకే విశిష్టస్థానమును సంక్రమింపజేసిరి. సీతారాములను పౌరాణిక వ్యక్తులుగ సాక్షాత్తు భగవంతుని అవతార మూర్తులుగ భావించి కొలుచుచునే వారిని తమవంటి సాధారణ వ్యక్తులుగ తలంచుచు తమ ఆలోచనా సరణిని, అలవాట్లను వారికి అంటగట్టి ఆనందించిరి. ఈ పాటలయందు, శ్రీరాముని తండ్రిగ, సీతమ్మను తల్లిగ భావించి ఆరాధించి ధన్యులైనారు. సీతమ్మ సుఖ జీవితమును తలచుకొని తాదాత్మ్యమును చెందిరి. ఆమె కష్టముల నన్నిటిని పరికించుచు దుఃఖ సముద్ర మున మునిగిరి. సీతాదేవి ఆటపాటలను తలచుకొని మురిసిపోయిరి.

రామాయణ మహాకావ్యము నందలి ప్రముఖ పాత్ర లన్నిటియందును స్త్రీల నాకట్టుకున్న ఒకే ఒక పాత్ర సీతమ్మ. స్త్రీలు ఈమెను కేంద్రముగా గ్రహించి సామాన్య గృహ జీవితము నందలి సంఘటనలను ఆధారముగా తీసికొని పెక్కు పాటలుగ అల్లుకొని నిత్యము వానిని గానము చేయుచు భక్తిముక్తులు రెంటిని పొందగలిగినారు. 'భావనారూపమైన భారత దేశమునకు ప్రతీక సీతాదేవి. స్వభావముచేత సీతాదేవి స్వచ్ఛమైన భారతీయ స్త్రీ. సీతాదేవి కథ విని స్పందించని హృదయముండదు. పులకించని తెలుగు స్త్రీ యుండదు. విన్న ప్రతిమారు మళ్ళీ వినాలనిపించే రామాయణ కథలోని సీతాదేవి కథను తమ కను గుణంగా మలచుకున్నారు జానపదస్త్రీలు. కావుననే వాల్మీకి రామాయణంలోలేని కల్పనలు స్త్రీల పాటలలో చోటుచేసికొనినవి. సీత సమర్త, సీతాకల్యాణము, సీతమ్మవారి అలుక, సీత గడియ, సీతాదేవి వేవిళ్ళు, సీతాదేవి వామన గుంటలు, కోవెల రాయబారము, మున్నగునవి స్త్రీల కాల్పనిక యితివృత్తములకు ఉదాహరణములు. స్త్రీల పాటలలోని సీతాదేవి నామ

స్త్రీల గేయ కావ్యములు- కృష్ణశ్రీ, భారతి, 1953

మాత్రమే. కాని భావములన్నియు జానపద జీవితమునకు చెందినవే సన్నివేశము లన్నియు సామాన్య గృహస్థ జీవితమున గోచరించు దృశ్యములే'.[1] రామాయణపు పాటలలో సీతమ్మకు ప్రథమ స్థానమును కల్పించిరి ఆంధ్రపురంధ్రులు. వాల్మీకి రామాయణము నందు గూడ సీతాదేవికి శ్రీరామునితో సమ ప్రాధాన్యము కల్పింపబడినది. కావుననే వాల్మీకిమహర్షి రామాయణమును 'సీతాయాశ్చరితమ్'[2] అని కూడ పేర్కొనినాడు.

వాల్మీకి రామాయణమును అనువాదము చేయునపుడు పెక్కుమంది కవులు స్వతంత్రానువాదమునకే ప్రాధాన్యము నొసంగిరి. ఆనాడు జనసామాన్యము నందున్న కథల నన్నిటిని తమ గ్రంథములందు జేర్చి వినూత్నములగు కావ్యములుగ తీర్చిదిద్దిరి అట్టివానిలో పేర్కొనదగినది రంగనాథ రామాయణము. భాస్కర రామాయణము గూడ ఈ కోవకు చెందినదే. శిష్టసాహిత్యము నందే యిటులుండిన జానపద సాహిత్యమును గూర్చి చెప్పవలయునా! స్త్రీల రామాయణపు పాటలలో సన్నివేశ కల్పనమునకు మాత్రమేగాక పాత్రల స్వభావ చిత్రణమునకును ప్రాధాన్యము కల్పింపబడినది. శ్రీరాముడు, సీత, లక్ష్మణుడు, శాంత, కౌసల్య, దశరథుడు మున్నగు వారందరిని రాజాంతఃపురము నందలి వ్యక్తుల వలెగాక సామాన్య కుటుంబ జీవనమును సాగించు వ్యక్తులవలె తీర్చిదిద్దినారు. ఈమార్పు ఎంతో సహజముగ నుండి ఈ పాటలను పాడువారు వినువారు గూడ సీతారాములను తమలో నొకరిగ భావింతురే గాని అన్యముగా తలంపరు. కావుననే స్త్రీల పాటలలోని రామాయణము అత్యంత ప్రశస్తిని పొందినది.

సీతమ్మను సామాన్య గృహిణిగ తీర్చిదిద్దుటచే 'భారతనారీధర్మము లన్నియు ఆమె యందు ప్రతిఫలించినవి. పేరునకు మాత్రమే ఆమె జనక మహారాజు కుమార్తె, దశరథమహారాజు కోడలు. అయినను శ్రీరాముని సహధర్మచారిణిగ, అత్తమామల యందు అణకువ గలిగి, ఆడబిడ్డ యెడ అభిమానము కలదై, తోటి కోడండ్రను గారవించుచు, సేవకాళి యెడ ఆదరాభిమానములు కలిగినదై అందరి మన్ననలకు పాత్రమైనది. 'శాంతి, దయ, సౌశీల్యము మున్నగు గుణములచే విలసిల్లి సకల పతివ్రతాజనతాలంకారంబై యొప్పు లోకమాత సీతంబోలు సతీరత్నంబు కానరాదు. సీత ఆదర్శగుణోపేత. భారతనారీమణులకు ఆరాధ్య చరిత్ర. ఆమె సౌశీల్యమిల్లాంధ్ర కెల్లను మేల్బంతి'[3] అనియును కొనియాడబడినది.

స్త్రీల రామాయణపు పాటలలో సీతమ్మను సుగుణాలరాశిగ చిత్రించిరి పాత్రల శీలచిత్రణమును రచయిత మనోనిగ్రహముతో సాగింపవలయును. అనేక విషయములను దృష్టియందుంచుకొని పాత్రచిత్రణమును గావింపుచు ఆయా పాత్రలకు న్యాయమును సమకూర్చుట కత్తిమీద సాము వంటిది. ఈ కష్ట కార్యమును స్త్రీల రామాయణపు పాటల రచయితలు మనోనిగ్రహముతో, దూరదృష్టితో కొనసాగించి కృతకృత్యులైరి. సీతమ్మను చిలిపిదనము, అమాయకత్వము, పాతివ్రత్యము మూర్తీభవించిన స్త్రీమూర్తిగ తీర్చిదిద్దిరి. సీతాదేవిని సామాన్యగృహిణిగ చిత్రించు

1. స్త్రీల పాటలు- సీతా కళ్యాణము- రావి ప్రేమలత, స్రవంతి, 1974
2. కావ్యం రామాయణం కృత్స్నం
సీతాయాశ్చరితమ్ మహత్
3. శ్రీరామసాహితి-పిల్లలమర్రి వెంకట హనుమంతరావు - శాంతి - సాహిత్య సంకలనము.

టచే స్త్రీల నైజగుణముల నన్నిటిని ఆమెయందు ప్రతి ఫలింపజేసిరి. ఒక్కమాటలో చెప్పవలె నన్న 'ఉదయ వాయువులోని ప్రసన్నతా, విద్యున్మాల యందలి చైతన్యము, భూదేవికి గల క్షమ, సహస్రదళకమలపు సౌందర్యము చేర్చి నిర్మించారు సీతమ్మను స్త్రీలపాటల రచయితలు'[1]. అను కృష్ణశ్రీ గారి అభిప్రాయము సమంజసమైనదే.

సీత సౌందర్యమును వర్ణించు సందర్భమున భంగ్యంతరముగ ఆమె పాతివ్రత్యము శ్రీరామునిచే ప్రశంసింపబడినది. సీతాన్వేషణ సమయము నందు ఆంజనేయుడు సీతను గుర్తించుటకు తోడ్పడు ఒకే ఒక సాధనము ఆమె సౌందర్యము. ఈ సందర్భమున రాముడు ఆమె సౌందర్యమును సహజముగ, మనోజ్ఞ ముగ వర్ణించెను. ఈ వర్ణన తుచ్ఛమగు అంగాంగ వర్ణనతో కూడిన బాహ్యసౌందర్యమునుగాక విశిష్ట మగు ఆమె అంతస్సౌందర్యమును సూచించుచు హృదయాహ్లాదమును కలిగించుచున్నది.

తలలంటు ఆడకే ఆడినట్లుండు
నీలంపు తలకుంచ గలిగుండుగాని
పచ్చిపసుపలదకే అలదినట్లుండు
బంగారమొగచాయ కలదెమాకాంత
పెట్టకను కాటుక పెట్టినట్లుండు
దిద్దక తిలకమ్ము దిద్దినట్లుండు
చేయక శృంగారము చేసినట్లుండు
అలదక పరిమళము లలదినట్లుండు
వేయక తాంబూలము వేసినట్లుండు
పగడంపు ఒకచాయ కలిగుండు కాంతా
మసిపాతగట్టిన మాణిక్యము వలెను
నిగురుపై గప్పిన నిప్పులాగునను
మేఘములోనున్న సూర్యుని వలెను
మెరుగుజెడియున్నట్టి అద్దమ్ము వలెను
పరమ సతి ప్రభావమెల్ల జెడియుండు
రాహుబట్టిన చంద్రమండలమురీతి

దీనియందు సీతాదేవి పరమ పతివ్రత అని భర్త యగు శ్రీరాముని చేతనే కీర్తింపబడినది. సీత పాతి వ్రత్యమును గూర్చి రామునకు తెలియును. కావుననే ఆమె సౌందర్యమును వర్ణించు నెపమున ఆమె పాతి వ్రత్య నిరూపణము గావించినాడు. పాటలో పేర్కొన బడిన పరమసతి అను పదము అమె పాతివ్రత్య మును గూర్చి వేనోళ్ళ చాటుచున్నది.

రామాయణము నందు పాతివ్రత్యనిరూపణమునకై జరిగిన పరీక్ష యందు సీత ఘనవిజయమును సాధించి నది. రావణవధానంతరము శ్రీరాముడు లోకాపవాద భీతిచే సీతను గ్రహించుట కిచ్చగింపక ఆమెను యథేచ్ఛ జనుమని పలుకుటతో రాముని అంతఃకరణము నెరిగిన సీత అగ్నిప్రవేశము చేసి తన పాతివ్రత్య మును నిరూపించుకొని అందరి మన్ననలకు పాత్ర మైనది.

రాముడు రావణుని వధించిన పిదప సీతను తీసికొని రమ్మని విభీషణుని ఆదేశించెను. 'మునుపటి రూపున తెత్తునా యిప్పటి రూపున తెత్తునా' అని విభీషణుడు ప్రశ్నింప ఇప్పటి రూపు తనకు తెలియదు. కావున మునుపటి రూపముననే తెమ్మని పలికినాడు. ఇప్పట్టున సీతాసౌందర్యము మనోహరముగ వర్ణింప బడినది. సర్వాలంకారభూషితయైన సీత సౌందర్యము తనకే కొత్తగా నుండి ఆమె మనసు నందొక విధ మగు అనుమానము జనించి చింతించుచున్నది–

నిలువుటద్దము చూచి అతివ చింతెంచె
రారాజు తన్నింక నమ్మడని పల్కె

1. దేశి సారస్వత విభూతి– శ్రీపాద గోపాలకృష్ణమూర్తి– కిన్నెర, డిసెంబరు, 1953

నాకు ఆభరణాలు ఏల యిచ్చితిరీ
దేవర నమ్మించవచ్చునోలేదో

తన రూపమును చూచుకొనుటతోడనే భర్త తనను అనుమానించునేమో యను సంశయ మామెకు కలిగినది. ఆమె సంశయము యథార్థమైనదే. రాముడామెను చూచుటకైనను యిచ్ఛగింపక యథేచ్ఛగా జనుమని కఠినముగా పలుకుటతోడనే ఆమె మూర్ఛనొంది ధరణిపై వ్రాలినది, మూర్ఛ తెలిసిన పిదప నామె రథముపై వేగముగా నరుగుచున్న శ్రీరాముని గాంచి ఆతని నుద్దేశించి -

పోకు పోకు రామ పుణ్యశ్రీరామ
ముగ్గురన్నదమ్ముల ఆనసుమ్మనెను
పోకుపోకూ రామ పోకు శ్రీరామ
భూదేవి పుత్రికను జనక కన్యకను
నాయాన అని పల్కె సీతామహాదేవి
పరమ పతివ్రత సీతపై ఆనబెట్ట
పంకజాక్షుల రథము కదలాచు

పరమ పతివ్రత కావున ఆమె తనపై ఆనబెట్టగనే అంతటి రాముని రథము కదలక నిలిచినది. అయినను రాము డామెకు 'కుక్క ముట్టిన కుండ కుదరదు మాకు' అనుచు నీచముగా మాటలాడ నామె దుఃఖించుచు తన ఆడజన్మమును గూర్చి చింతించినది-

ఆడజన్మము బుట్టి అజ్ఞాని నైతి
గుబ్బాలలోనైన పుట్టలేనయితి
ఏనుగులవలె మరి నేపుట్టనయితి
బంటువలె నేనుంటె బ్రతుకయినపోదు
కపిభల్లూకముల సాటి కాకుందనయితి
పక్షులలోనైన జన్మించనైతి
తక్కువ నోములకు అధికఫలంబు
కోరికలు కోరితే కొనసాగుబెట్లు

తన నోము ఫల మీలాగున నున్నదని తలంచి చింతించి అగ్నిప్రవేశము చేయ తలపెట్టినది -

అగ్నిజొచ్చి నేను వోడితినయినా
నెలమూడు వరషాలు కురవవెన్నటికి
అగ్నిజొచ్చినేను వోడితి నయినా
శ్రీరాము సతిగాను శ్రీలక్ష్మణుండ
అగ్నిజొచ్చినేను వోడితినయినా
భూలోకమాతనరు ఈపృథివి పయిన

అని అనేక విధములుగ ప్రతిజ్ఞలు చేసినది. తన పాతివ్రత్యముపై ఆమెకు గల ప్రగాఢ విశ్వాసమే ఈ విధముగ ప్రతినలు పల్కుటకు తోడ్పడినది. పిదప నామె అగ్నిహోత్రుని యథావిధిగ పూజించి తన పాతివ్రత్య మెల్లరకును నిరూపింప వేడుకొని 'జలనిధి జొచ్చినట్లగ్ని జొచ్చినది'. ఆమె పాతివ్రత్య మహిమచే భగ భగ మండు పావకుడు చల్లబడినాడు. కణకణ మండు నిప్పులన్నియును కుంకుమ్మ లయినవి. ఇచట సీతమ్మ తన విజయమును గర్వముగా చాటుకొనినది.

జయిస్తి శ్రీరామ జయిస్తి నగ్ని
దశరథుల తనయుడా జయిస్తి నగ్ని
కౌసల్య తనయుడా జయిస్తి నగ్ని
కాకుత్స్థతిలకుడా జయిస్తి నగ్ని
సూర్యకులవర్ధనుడ జయిస్తి నగ్ని
శాంతకు తమ్ముడ జయిస్తి నగ్ని
రాఘవుల తమ్ముడ జయిస్తి నగ్ని

అనుచు పలికిన సీతను జూచి రాము డింకను అనుమానించుచు -

ఆడవారికి గలవు అగ్నిమంత్రములు
ఆలికేరు యేడిచేరు ముగ్గుబెట్టేరు
మండేటి మంటలకు మూపు మసిలేరు
కాగేటి యెసర్లైన కలిమదిసేరు

అని పలికిన అగ్నిహోత్రుడు కపుడు అహంకార మెచ్చి ఆకాశమంతట పెరిగినాడు.

అంతలో భూదేవి అతివేగ వచ్చి
సీతయు శ్రీరాము లొడగూడ కుంటె
యింకను జలనిధులు యిది నిజము సుమ్మీ

సీతయు శ్రీరాము లొప్పు వినకుంటె
ధరమీద పంటలు పండ వెన్నటికీ
ఆదేవి పల్కులకు ఆత్మ నుప్పొంగి
దశరథులు తావచ్చి తనయునితొ బల్కె
పరమపతివ్రత సీతపణతియుసుమ్మీ
జానకి నీవింక చేకొనకుంటె
ఉర్విని లోకములు ఉండనేరవుగ
పరలోకములు లేవు పరమాత్మ మాకు

అనుచు భూదేవియు, దశరథులును ప్రార్థింపగ శ్రీరాముడు సతిని గైకొని అయోధ్యాపురమున కరిగి పట్టాభిషిక్తుడైనాడు.

'రాముని సౌజన్యమునకు సీత పాతివ్రత్యము బంగారమునకు తావి యబ్బినట్లై కీర్తనీయమైనది. సహధర్మచారిణియై భార్య భర్తకు పురుషార్థ సాధనములో తోడ్పడునది యని భారతీయ సంప్రదాయము బోధించును జానకి పతివ్రతలకు శిరోలంకారమై భాసించు భవ్యచరిత'.[1] సీత సహధర్మచారిణిగ రాముని అడుగుజాడలలో పయనించి ఆనందించు పుణ్యశీల. తండ్రి ఆజ్ఞానుసారము, పిన తల్లి కోరికపై శ్రీరాముడు అరణ్యవాసము చేయబోవుచు సీతను వెంట తీసికొనిపోవుటకు రాము డిచ్ఛగింపడు. సుకుమారి యగు నామె అరణ్యవాసక్లేశముల ననుభవింపలేదని రాముని యుద్దేశము. అయినను ఆమె రామునితో అరణ్యమున కేగుటకు సన్నద్ధమగుచు తన గమనము నీ విధముగ సమర్థించుకొనుచున్నది. ఋషుల ఆశ్రమము అను పాట యందు -

నను మీకిచ్చుతోనె నాభారం
మీమీద పడ్డది మీరె నాదిక్కు
చెట్టునా పాకింది చెలువైన తీగె
చెట్టువిడి యెక్కడికి చేరంగ గలదు
అండదప్పినా వెన్క అది నిల్వగలదా
మీతోడ నుండుటే ఖ్యాతినాకౌను
అయోధ్య పట్నంబునందుకంటేను
దేవేరిగా నేను దివురుకంటేను
లోకేశ నీతోటి లోకంబు నాకు
నీవుండగా నాకు నెఱియన్నిగలుగు

అయోధ్యపట్నము నందు దేవేరిగా నుండుట కంటెను ప్రాణసమమగు నాథుని చెంతనుండుటే తన అభిమతమని ఆమె పక్కాణించినది. సంక్షేప రామాయణము అను పాట యందు-

మూనుబారినతీగె మ్రానుతో గాని
మానుబోయిన వెనుక మరిబ్రతుకగలదా
దీపంబుతో గృహము దీపిల్లుగాని
లేకున్న ఆగృహము చీకటయిపోవు
మాకు మీతోనుండ లోకంబు గాని
లోకేశ యిక నొండు లోకంబు గలదా

అనుచు ఆమె శ్రీరామునితోడిదే తన లోకము అనునటుల సంచరించినది. తుదకామె భర్త అనుజ్ఞ వడసి అతనితో వనవాసమున కేగినది. దీనియందు సీతారాముల అన్యోన్య జీవితము సీతకు రామునిపై గల అనురాగము ప్రతిఫలించుచున్నది.

సీతమ్మవారి అలుక అను పాట భార్యాభర్తల నడుమ గల చిటిపొటి తగవులకు నిదర్శనము. శ్రీరాము డొకనాడు-

ఆటకూటమ్ములో అయోధ్యలోను
నట్టింట రాములూ సాధకము చేసి
అందుపైన గరడిసాధనము చేసి
అలసొచ్చి చెమ్మటలు అలదమనెగాని
ఇకనేమనదాయె నెగ్గింపదాయె
సీత పతిమాటలను చింతింపదాయె

1. శ్రీరామసాహితి-పిల్లలమఱ్ఱి హనుమంతరావు- "శాంతి" వ్యాస సంకలనము,

పడతి తన మాటలను పాటింపదాయె
చూచి చూచియు రాము శూరునికి నపుడు
ఎఱ్ఱని తనకనుల హెచ్చె కోపమ్ము
పూని తన చే నున్న పువ్వుల్లబంతి
విసరె సీతమ్మపై విసవిసలు పడుచు

అలసి వచ్చిన తనకు సేదతీర్చు యత్నమేమి యును చేయక, తనను గూర్చి పట్టించుకొనక యుండిన సీతను జూచి రాముడు కోపించి తన చేతిలో నున్న పూవుల బంతిని ఆమెపై విసరినాడు. సుకుమారి యగు సీతాదేవి ఆ బంతి తాకుడునకే మూర్ఛ నొందగా రాముడు చెలికత్తెలను పిలిచి ఆమెకు సపర్యలను చేయించినాడు. మూర్ఛ తెలిసిన పిదప ఆమె కోపమును పట్టజాలక ఒంటి స్తంభపు మేడలోనికి పోయి ముసుగుబెట్టినది. సీత పెంపుడు చిలుక యిరువురి అలుకలను తీర్చుటకై యత్నించినది. కాని దాని ప్రయత్నము విఫలమగుటతోడనే లక్ష్మణుని సహాయ మర్థించి, అతని సలహా ననుసరించి సీత వద్ద కేతెంచి - 'రఘురాము వంట్లోను లఘువు తప్పింది' అని పలుకగ సీత అదిరిపడి తన అలుక నంతను మరచి గుండెలదరుచుండగ విషయమును వివరింపుమని చిలుకను బతిమాలుచు రఘురాముని చెంత కరిగినది. సీతాదేవి తాత్కాలిక క్రోధావేశములతో భర్తపై అలిగినది గాని అతడనిన ఆమెకు మిక్కుటముగ ప్రేమానురాగములు కలవు. "శ్రీరాము వంట్లోను లఘువు తప్పింది" అనగానే ఆమె తన అలక విషయమును విస్మరించి రాముని క్షేమమును కనుగొనుటకై ఆతురతతో బయలుదేరినది.

ఈర్ష్యాసూయలు సర్వమానవసాధారణ మగు నైజగుణములు. వీనిని సీతాదేవికి కూడ అంటగట్టి తమలో నొకతెగనే భావించినారీ జానపదస్త్రీలు. సీతాదేవి ఒకనాడు శాంతతో సరసము లాడుచు అంతఃపురమునకు రాకుండుటచే కుపితుడైన రాముడు సీతాదేవి నాట పట్టించుటకై తన విల్లంబులను పరిచారికలుగ నేర్పరచి వారితో వినోదించు చుండెను.

ఆ సవ్వడి వినిన జానకి తత్తరపాటుతో అంతఃపురమునకు వచ్చి -

చూచివత్తమని జానకిదేవి
జాలకర్రలా వెంటనే చూచుచు
విభ్రాంతిగొని యిట్లని పలికె
ఏకపత్నీవ్రతుండవు అనుచూ
ఇచ్చెగాక మాతండ్రయితేను
ఏకపత్నీవ్రతములు అన్నీ
తెలిసెగదా ఇక్కడ ఈలాగు

అని రాముని అనుమానించి దుఃఖించినది. ఇది విన్న మాయాస్త్రీలు -

ఎక్కడిదానవె జానకి నీవు
ఎప్పటికీ మేమే వున్నాము
అడవులలో నీవు బాసినప్పుడు
అంత వేడుకతో మాతో వుంటె
విల్లు విరువగా వచ్చినదానవు
ఎక్కడిదానవె జానకి నీవు

అని సీతను అవమానపరచిరి. శాంత వచ్చి జరిగిన విషయము గ్రహించి యిరువురకును సంధి యొసర్చినది. ఇచట ముందు వెనుకలాలోచింపక అనుమానించుటయను మానవ మనస్తత్వము ప్రతిబింబింపబడియున్నది

సీతాదేవి పతిభక్తి ఎన్నదగినది. ఎన్నికష్టముల ననుభవించినను ఆమె తన మనసు నందు సదా శ్రీరామనామమునే జపించుచు జీవితమును గడపినది. లంకానగరములో అశోకవనము నందు శింశుపాతరువు క్రిందనున్న సీత పతినామ స్మరణమును చేయుచు ఆంజనేయుని కంటబడినది. ఆంజనేయుని శ్రీరామదూతగా గుర్తించిన సీతమ్మ లంకలో తన జీవితము "దినదినగండాలు దెయ్యాలతో పోరు"వలె నున్నదని అభివర్ణించినది. శత్రువును నిహతుని గావించి తనకు త్వరగా విముక్తిని ప్రసాదించుటకై శ్రీరాముని యత్నింపుమని చెప్పుచు ఆంజనేయుని వేడుకొనెనది.

అప్పు డాంజనేయుడు - "రమణి నాతో రమ్ము రాముతో గూర్చెద" అని పలుకగ జానకి —

అతివ జానకిపల్కె అది మంచిపనికాదు
శ్రీరామచంద్రుండు శీఘ్రంబు కపులతో
వారధిని బంధించి వచ్చి రావణు ద్రుంచి
వనితను గొనకున్న అపకీర్తి యగుననుము

శత్రువు చెఱలోనున్న తనను దొంగతనముగ తీసికొనిపోయినచో రామునకు అపకీర్తి కలుగును. తన భర్త యశస్సును ఆకాంక్షించిన స్త్రీ యగుటచే శత్రుకూటమున బాధలననుభవించుటకు ఇచ్ఛగించినది గాని భర్తకు అపకీర్తి కలుగుట కామె యిచ్ఛగింప లేదు.

పరపురుషుని తండ్రిగా పరస్త్రీని తల్లిగా భావించుట మన భారతీయ సంప్రదాయము ఈ విధమగు భావన ఎవరి యందు లోపించినను వారికి వినాశనము తప్పదను విషయమును రామాయణ మహాకావ్యము బోధించుచున్నది. ఇచట లంకాధీశుడగు రావణుని చెఱ యందున్నప్పటికిని అత డెంత ఆశలను చూపినను సీత మారు పలుకక వానిని కన్నెత్తియైనను చూడక ఆ పాపకర్ముని జనకునిగ భావించినది. కుశలవ కుచ్చల కథలో -

పదినెలలు చెఱనుంటిని గాని
పాపకర్ముని కన్నుల జూడ
జనకునిగా భావిస్తిని నేను

అని సీత శాంతాదులతో పలికినది. రావణుడు మోహావేశముతో తనను చెఱయందుంచినను తాను మాత్రము వానిని జనకునిగానే భావించినది. కాని రావణుడు పర స్త్రీలను చూచి మోహపరవశుడగుచు వారితో పొత్తు నభిలషించుచుండును. మహాసాధ్వి యగు సీతాదేవిని బలాత్కారముగ లంకకు తీసికొనివచ్చుటచేతనే రావణుడు సమూలముగా నాశనమైనాడు.

సీత చెఱ అను పాట యందు రావణుని అన్నగ భావించి సంభాషించుట కాననగును. పరమ పతివ్రత పరపురుషునితో మాటలాడదు కావున సీత రావణునితో సంభాషించుచున్నపు డెల్ల గడ్డిపరక నొకదానిని ఎదుట నుంచుకొని దానితో సంభాషించినట్లు కథలు ప్రచారములో నున్నవి.

ఎదుర నిలిచీనట్టి దశకంఠు జూచి
సీతోటి బల్కెరా సీచాధముడ
అమరంగ వక తృణం అతివ చేపట్టి
యీ పూరి పుడకతో పల్కెద ననుచూ

ఈ క్రింది పాట యందు రావణు డామెకు ఆశలను చూపుచు మోహపరవశు డగుటయు, సీత రావణుని నాశనమును కోరుచుండుటయు కాననగును.

ఏవేళచూసినా ఏలచింతించేవు
సీతరో మాలంక ఏలిస్తు నిన్ను
అన్నరో మీ లంక ఏల మాకేటికి
మక్కువతో మా వదిన మండోదరేలు
కలకలమాటాడి కనులెత్తి చూడవే
సకలాభరణమ్ములు సొమ్ములిచ్చేను
నారచీరలుగట్టి వనము సొమ్ములు చేసి
రాములే నాసొమ్ము ఎల్లకాలమ్ము
వచ్చినదానవు వనములో నిలిచితివి
చనువునా మా లంక చొచ్చిరావేమి
వచ్చేను శ్రీరాము డొచ్చేను లంక
పదితలలు నరకంగ అపుడు చూసేము

భర్తృక్షేమమును, సౌఖ్యమును ఆకాంక్షించు ప్రతి స్త్రీ కనిపించిన ప్రతి దైవమును వేడుకొనుచుండును. ఋషుల ఆశ్రమము అను పాట యందు సీతాదేవి-

కొమ్మలార మీరు కోసలేంద్రుండు
ఏ కష్టములులేక హితవుమీరంగ
అరణ్యవాసంబు కరమొప్పునట్లు
జరిపి అయోధ్యకు తరలంగజేయ
వేడుదు మిము వృక్షమ్ములారా

అయోధ్యపట్నమ్మునందిన వెనుక
ముత్యాల రత్నాల మురువొప్పగాను
పూజిస్తు మిమ్ము పూబోండ్లతోడ
తేనెలుపోయుదు తేకువ మీకు
మిమ్మెవరు కొట్టకుండ మేలు గలుగంగ
నా విభునితో జెప్పి నేవేవి యైన
జేయిస్తు మీకును సిరిగల్గునటుల
భాగీరథిని మీకు ప్రాకిస్తు...

అనుచు తన భర్త అరణ్యవాస మంతయు ఏ కష్టము లును లేకుండ జరిగిన యెడల ఆ అరణ్యము నందలి వృక్షరాజముల నన్నిటిని పూజింతు ననియు, వానికి మేలు జేయుదు ననియు వేడుకొనుచున్నది. తన భర్తకు, బిడ్డలకు కలిగిన కష్టములను నివారింపుమని ప్రతి చెట్టును, పుట్టను ప్రార్థించుట స్త్రీ లక్షణము. ఈ లక్షణము సీతాదేవి యందును ప్రతిబింబించినది.

సుఖము కలిగిన పొంగుట, దుఃఖము కలిగిన కృంగుట సర్వమానవ సాధారణము. ఈ లక్షణము ఆర్ద్రహృదయలగు స్త్రీల యందు మరింతగ నుండును. కష్టములు సంభవించినపుడు వాని ననుభవించుచునే ఆ క్లేశములకు కారకు లగువారిని నిందించుట సర్వసామాన్యము. ఈ సామాన్యలక్షణము సీతమ్మ యందు గూడ ప్రతిఫలించినది. ఋషుల ఆశ్రమము అను పాటయందు -

ఇట్టి రాళ్ళలోను ఈ శిలలలోను
యెట్లు నడువంగ బంపెనే మీకైకమ్మ
తాను నడచిన తెలియుగాని కష్టములు
హంసతూలిక శయ్యనందు బరుండి
ఏనాడు పతియన్న కానిమాటలను బట్టి
మనల నడవిపట్టమని చెప్పి
పిల్లల తల్లికి ప్రేమ యిట్లుంట
నేలోకమున లేదు యీలోక మందె

తమ అరణ్యవాస క్లేశములకు కారకురాలగు కైక పిన్నత్తగారు కావునను, అత్తాకోడండ్ర నడుమ సామరస్యము తక్కువ కావునను కోడలు అత్తగారిని నిందించినటుల కాననగును.

సీతాదేవి మహారాజ్ఞియైనను ఆమెను అత్తింటి కోడలుగ సామాన్య గృహిణిగ తీర్చిదిద్దిరి. సీత గడియ అను పాట యందు -

అత్త కౌసల్యకు అడుగులు వత్తి
మామ దశరథులకు మడత లందించె
సుమిత్ర కైకకు సురటీలు వేసి
పరగ కౌసల్యకు పానుపూ పరచె

సీత అత్తమామలకు సేవ చేసినటుల కలదు. నిజమునకు సీత ఆ విధముగ సేవలు చేయవలసిన ఆవశ్యకత లేదు. కాని ఈ పాటల రచయితలు సీతాదేవి మహారాజ్ఞి అను విషయమును విస్మరించి తమలో నొకతెగనే భావించి తమ పైనందిన కార్యకలాపముల నన్నిటిని ఆమెకు అంటగట్టిరి.

ఇట్లే సీత అప్పగింతల పాట యందు గూడ సీత తల్లి ఆమె అత్తింట ప్రవర్తింపవలసిన తీరును గూర్చి విపులముగా వివరించినది

అత్తమామలతోటి హర్షంబు గట్టి
అణకువతో సంచరించు మాయమ్మ
వదినమరదళ్ళతో ఓర్పుగలిగుండూ
విమరిశతో తిరుగు వెలదిమాయమ్మ
బావమరుదులతోటి భయభక్తి గలిగి
బహు నెమ్మదిగ తిరుగు బాల మాతల్లి
తోటికోడళ్ళతో కలతలాడకుమీ
కూరిమి గలిగుండు గుణము గల తల్లీ
ఇరుగుపొరుగుల వారి యిండ్లకును పోకు
విమరిశ కలిగుండు వెలది మాయమ్మా

ఈ పాట యందు సీతపరముగ "ఉత్తమ ఇల్లాలి" లక్షణములు వివరింపబడినవి.

సాధారణముగ వదినామరదళ్ళ నడుమ పొత్తు కుదురుట కష్టము కాని ఈ పాటల యందు సీతా శాంతలు అన్యోన్యానురాగమును కలిగియున్నట్లు కాననగును. సీత సురటి అను పాట యందు -

వదినెగారట మీరు మరదళ్ళతోనూ
నవ్వేటి భాగ్యమెంతటి వారికి గలదూ
మీవంటి వదినగార్లూ గలగ భమిడి
పూవుల పూజిస్తిమో పురుషోత్తములనూ

అనుచు సీత శాంత వంటి ఆడుబిడ్డను పొందియుండుట తమ పూర్వజన్మ సుకృతము వలననే యని శాంతను కీర్తించినది. అటులే శాంత గూడ -

తామర కమలమందు పుట్టియో
ధరణిపై నిలువలేక
ఈశ్వరుని కృపవలననూ నీవు మా
యిల్లు జొచ్చినావు
కోమలి సీత నీవు కోడలవు
పావనమాయె గృహము

సీత కోడలగుటచే తమ వంశమునకే కీర్తి కలిగినదని గర్వముగ పలుకుచున్నది.

శాంతకూతుడు గాను సీత కోడలుగా
నోచిన నోములన్నియు సఫలమాయె

అని అత్తగారిచేకొనియాడబడినది. అత్త ఆడుబిడ్డలచే కొనియాడబడిన స్త్రీ జీవితము ధన్యమైనది.

సీతాదేవి శ్రీరాముని ధర్మపత్ని, మహారాజ్ఞి అయినను ఆమె తన బాధ్యతలను వదలలేదు. పురజనులనామె కన్నబిడ్డలవలె భావించి పాలించినది. కావుననే వారందరును సీతాదేవిని కన్నతల్లివలె భావించిరి.

సీతారాములు పదునాలుగేండ్లు అరణ్యవాసము గావించి తిరిగివచ్చిన పిదప తనను చూడవచ్చిన పురజనులందరిని ఆమె సమాదరించి యోగక్షేమములను విచారించినది కుశలవ కుచ్చల కథయందు సీతాదేవిని గూర్చి పురవనితలీ విధముగ తలంచుచుండిరి,

పదియు నాలుగు వత్సరమ్ములూ
వనములు దిరిగిటు వచ్చిన కొమ్మా
మరువలేదు మనల నెవ్వరిని
ఆనాడే భాగ్యము పండె నని
జానకిని కొనియాడుచు మదిలో

ఇచట జానకీదేవి ఆశ్రితవాత్సల్యము కొనియాడబడినది.

సీతాన్వేషణము మొదలు రావణ వధానంతరము సీతారాములు అయోధ్య చేరువరకును నీడవలె వెన్నంటి యుండినవాడు ఆంజనేయుడు. అతడు సీతారాములను తల్లిదండ్రులుగా భావించి సేవచేసినాడు. సీత ఆంజనేయునియెడ పుత్రభావమును చూపినది. శ్రీరామ పట్టాభిషేకానంతరము హార మొకదానిని—

రామచంద్రుడు తన చేతి కందిచ్చి
హస్తముల బట్టుకుని పతిముఖము జూచే
ఎవ్వరిమూలాన వృద్ధిబొందితివో
వారికిమ్మని పలికె వనజనయనాలు
నా యాత్మబంధుండ నా జీవరక్షకుడా
మాయన్న హనుమంత రమ్మనుచు బిలిచే
తనచేత కంఠమాల హనుమంతు కేసి

సీత తన ఆత్మబంధువు అనుచు హనుమంతుని మన్నించి హారము నిచ్చి తన కృతజ్ఞతను చూపినది.

సీత ముగ్ధత్వము, అమాయకత్వము సీతాదేవి ఆనవాళ్ళు అను పాటయందు మధురముగ చిత్రింపబడినవి. ఆంజనేయుడు సీతాన్వేషణకై బయలుదేరుచు సీతమ్మ తనను విశ్వసించుట కేమియైన ఆనవాలు నీయుమని రాముని కోరగా రాము డతనికి తమ దాంపత్య జీవితము నందలి మధుర ఘట్టములు కొన్నిటిని వివరించెను. వానిలో సీత అమాయకత్వమును వర్ణించునవి కలవు.

ఈ అద్దములోను ఈ రూపుతోను
యింత చక్కని దేవి యిది యెవ్వరనుచు
ఆహా శ్రీరామా అయోధ్య రామా
సృష్టికి తవులుచేసి యిట్టు లెరిగితివా
ఏకపత్నీవ్రతుడవని యిచ్చె మాతండ్రి

ఏకపత్నీత్వంబు యింపుగా తెలిసె
ఇట్టి మాయం సతిని పిలిపించ దగునా

సీతాదేవి అద్దమునందు తన ప్రతిబింబమును చూచుకొని గుర్తింపలేక పరసతి యని భావించి శ్రీరామచంద్రుని ఏకపత్నీత్వమును శంకించినది. తన సౌందర్యమును తానే గుర్తింపలేక పోవుచుటచే శ్రీరాముని అనుమానించినది. సీత పలుకులను వినిన శ్రీరాముడు నవ్వుచు 'పతిలేని సతిజూచి నీకు అనుమానమయ్యేను. కావున నిపుడు జూడుమని సీత ప్రక్కన నిలిచిన ఆమె గుర్తించినది. దీనియందు సీత ముగ్ధత్వము ప్రతిబింబింపబడియున్నది. మరియొక సన్నివేశములో—

ఇదియేమి సోద్యయోయి యినవంశజుండా
మింట చంద్రుడు వచ్చి ధరణి నున్నాడు
తుమ్మెదలు వశాడుచున్నవి చూడరమ్మనెనూ

ఇచట సీతాదేవి స్నానమాడుటకై కొలనుకేగగా అచట నీటియందు తన ప్రతిబింబమును గాంచి చంద్రుడనియు, తన ముంగురులను గాంచి తుమ్మెదలనియు భ్రాంతినొంది శ్రీరామచంద్రునకా చోద్యమంతయు చూపుటకై తీసుకొని వచ్చినది. రామచంద్రుడంతయు గాంచి ఆమె అమాయకత్వమునకు ముగ్ధుడగుచు ఆమెకు విషయమును వివరించినాడు. ఇచట సీత సౌందర్యము భంగ్యంతరముగ సూచింపబడినది. నీటియందు తన మోమును గాంచి చంద్రుడనియు ముంగురులను గాంచి తుమ్మెదలనియు భ్రమపడుటలో నామె అమాయకత్వము ప్రతిబింబించి యున్నది.

సీతాదేవి వామనగుంటలు అను పాటయందు సీతాదేవి వామనగుంట లాడుటయు రాముడోడిపోయిన, జానకి—

పీటగట్టుమని బొంకి పారిపోదురా
ఆటకరువై వేలివ్వ లెక్కలున్నవి
వోలి గట్టక అడుగు దాటి కదలనివ్వను
నిలువు నిలువు మనుచు సీత అజ్ఞచేసెనూ

తనకు వోలిగట్టక పోనివ్వనని సీత రాముని పట్టి ఆపినది. రాముడు—

నేను గెలిచినా వోడినా నీసొమ్ము గాదటే
నీవు గెలిచితేను నాసొమ్ము గాదటే
భరతలక్ష్మణులు వింటె గేలిసేతురే
నావారంతా వింటె నవ్వుకొందురే

అనుచు ఆమెను బతిమాలుకొని వివిధములగు కానుకలన్నియును ఆమెకు ఇచ్చెను సీతారాముల ఆటను గూర్చి వినిన కౌసల్యాదులు సీతను జూచి ఆటయందెవ్వరు గెల్చిరని ప్రశ్నింపగ సీత 'మీ కొడుకు గడుసు కనుక దిబ్బి తీసెనూ' అని రాముడే గెలిచి నటుల చెప్పినది. కాని తోడికోడంద్రతో నామె తాను గెల్చితిననియు, రాము డోడినాడనియు నిజమును పక్కాణించినది. అత్తల నద్దతన భర్తను చిన్నబుచ్చుట కిచ్చగింపక ఆతడే గెలిచినటుల పలికినది. కాని తోడికోడంద్రవద్ద తనే గెలిచితినని నిజమును పలికినది.

స్త్రీల కష్టసుఖములు స్త్రీలకే తెలియును. సీత తన చెల్లెలగు ఊర్మిళను గూర్చి విచారించి ఆమెకు శుభమును గూర్పదలంచి రామునితో నొక విన్నపమును గావించినది. సీతారాముల అరణ్యవాసానంతరము శ్రీరామ పట్టాభిషేకము సంభ్రమముతో జరిగినది. అన్న సేవలయందు నిమగ్నుడైన లక్ష్మణుడు తన ప్రాణప్రియను గూర్చి పట్టించుకొనడు. రాముడామె విషయమును మరచి తమ్మునికి అంతఃపురమునకు పోవుటకు అనుజ్ఞ నీయలేదు. ఈ పరిస్థితి నంతను గమనించిన సీత తన చెల్లెలి హృదయమును గుర్తించి ఆమె కష్టమును బాపదలంచి శ్రీరామునితో నొక విన్నపమును గావించినది—

దేవ దేవేంద్ర వినుమా
విన్నపము తెలిపేను చిత్తగింపు
ధరణీశ దపతరించ
ఒక చిన్న మనవి కద్దని పలికెను

ముందు మన మడవులకునూ
పోగాను ముద్దుమరది వెంటనూ
పయనమాయెనా ఊర్మిళా
వద్దు నీవుండుమనుచు సౌమిత్రి
మనల సేవింప వొచ్చే
నాడు మొదలు శయ్యపై కనుమూసి
నాతి పవళించుచున్నది
యికనైన యానతిచ్చి తమ్ముని
యిందుముఖి కడ కంపుడి'

అని రాముని వేడుకొనగా నాతడు తన తప్పిదమునకు విచారించి తమ్ముని అంతఃపురమునకు పంపెను. ఇట సీత సాటిస్త్రీగా ఊర్మిళ కష్టసుఖములను గ్రహించి ఆమెపై గల అభిమానముతో లక్ష్మణుని పంపుమని రామునకు విన్నపమును చేసినది.

సరససంభాషణమును చేయుటయందు సీత అందె వేసిన చేయి. వదినగారగు, శాంతాదేవితోగూడి ఆమె తన చెల్లెండ్ర 'తరపు'న వాదించినది. ఊర్మిళాదేవి నిద్ర అను పాటయందు సీత లక్ష్మణుని మేల్కొలుపుటచే తెలివి నొందిన ఊర్మిళను-

చేడె వినవె జానకి నీచెలియ
యూర్మిళా బుద్ధులన్ని
భమిడి పానుపున సొలసియుండె
నొక పదునాలుగేండ్లు పణతి
కుందనపు ప్రతిమ కళలు
ఈ కళలు ఎందుండి దాగున్నవో
దృష్టితగులకుండను
నీలాల నివ్వాళు లివ్వరమ్మా

అని శాంత పరిహసించినది. ఊర్మిళ సమాధాన మిచ్చుటకు బిడియబడుటచే సీత తన చెల్లెలిని సమర్థించుచు-

ఇంద్రాది చంద్రులను వంపించేటి
చంద్రులూ మీ తమ్ములు
దృష్టితగులకుండను
నీలాలు నివ్వాళు లివ్వరమ్మ

అని బదులు పలుకగ శాంతమ్మ-

అక్కచెల్లెండ్రు మీరు మిక్కిలీ
సౌందర్యశాలులమ్మ
మా తమ్ములు నలుగురిని
వలపించు జాణలకు దృష్టి తగులు

అని ఆమె మాటలను తిరిగి ఆమెకే అప్పగించినది. అయిన సీత ఊరకుండక-

మాయన్న ఋష్యశృంగు నీ
వనములో కూడి యెడబాయకున్న
ఏమి ఎరుగని తపసిని
ఓ పతిన కేళించి విడిచినావు

అనుచు తిరుగులేని సమాధానమును చెప్పినది. శాంతకు సీత అనిన అభిమానము మెండు. సీత అయోధ్యలో నున్నంత కాలము ఆమెను ఎడబాయక తిరుగుచు జీవితమును గడపినది. సీతా పరిత్యాగానంతరము ఆమెనే తలచుకొనుచు విలపించినది. వదినామరదండ్రింత సన్నిహితముగ ప్రేమానురాగములతో జీవించుట ఎచ్చటను కాన్పింపదు. వదినామరదండ్రింత ప్రేమానురాగములను కలిగియుండవలయు నని ఈ పాట ద్వారా లోకమున ప్రచారము గావించిరి. కాని ఈ సన్నిహితత్వము ఎచ్చటను సంభవింపదు.

సీత మాతృమూర్తిగా బిడ్డలపట్ల మమకారము, తన దయనీయ పరిస్థితిపై ఆవేదన భవిష్యత్తుపై ఆశ మూర్తీభవించిన స్త్రీమూర్తిగ చిత్రింపబడినది. వాల్మీకి మహర్షి ఆశ్రమమున సీతాదేవికి కుశలవులు జన్మించిరి. జానకి తన బిడ్డలకు జోలపాడుచు తన అసహాయత్వమునకు చింతించుచున్నది. కుశలవుల తొట్టె అను పాట యందు-

సిరిగజ్జు ఋషివల్లె సోమవీధులను
ముత్యాలు గూర్చిన పందిళ్లలోను
నారచీరలతోను ఉయ్యాలవేసి
జానకి తనయులను జోలలుపాడె

జానకి బిడ్డల నూరడించుచు జోలపాడుచు తన అసహాయత్వమును వెల్లడించినది.

ఏడవకు లవకుమార ఏడవకు కుశుడ
ఏడిస్తె మిమ్మెవ్వ రెత్తుకుందూరు
మెరుగుటందెలు గొనుచు అయ్య
మీ రఘురాము దొచ్చె నేడువకు
అంచు పంచెలు గొనుచు అంగీలు గొనుచు
అయ్య మీ రఘురాము దొచ్చె నేడువకు

అనుచు దీనముగా తన బిడ్డల నూరడించు చున్నది. మహారాజు బిడ్డలు, భోగభాగ్యాల ననుభవింపవలసిన వారు ఈ విధముగ ఏమియును పొందలేక నట్టడవి యందు చెట్లకు కట్టిన ఊయెలయందు పవళించుట గాంచిన ఆ మాతృహృదయము ఆవేదన నందినది. ఈ బాలురు అయోధ్యయందు జన్మించిన సకల భోగ భాగ్యములను అనుభవించెడి వారని తలంచి విచారించి నది.

ఉంగరమ్ములు గొనుచు ఉయ్యాల గొనుచు
ఊర్మిళా పినతల్లి వచ్చె నేడువకు
పట్టుటంగీలు గొనుచు పులిగోరు గొనుచు
భూదేవి అమ్మమ్మ వచ్చె నేడువకు
కాళ్ళ కడియాలు గొనుచు కంకణాలు గొనుచు
కౌసల్య మీ ముత్తవ్వ వచ్చె నేడువకు
దండకడియాలు గొనుచు తావేదులు గొనుచు
దశరథులు మీతాత వచ్చె నేడువకు
బంగారు గిన్నెలో పాలు నెయి పోసి
శాంతమ్మ మేనత్త వచ్చె నేడువకు

అనుచు పినతండ్రులు, పినతల్లులు, ముత్తవ్వలు, తాత, మేనత్త మొదలగువారందరును వివిధములను కానుకలను గొని తన బిడ్డల చూడవచ్చుచున్నారని జానకి తన బిడ్డల నూరడించుచున్నది. ఇట సీతమ్మ స్థితి హృదయవిదారకముగ చిత్రింపబడినది.

జానపదులు సీతాదేవి యెడ ఆదరాభిమానములను జూపి ఆమెను తల్లిగ భావించి తమ ఆచారవ్యవహార ములను, బరువు బాధ్యతలను, ఆలోచనలను సీతా దేవికి అంటగట్టి సంతృప్తి నందిరి. పరమ పవిత్రగా, అకలంక చరితగా, సామాన్య గృహిణిగా, బాధ్యత గల యింటి కోడలుగ, మాతృమూర్తిగ, చెల్లెంద్ర పైనను, పురజనులపైనను ఆదరాభిమానములను జూపు ఆదర్శ వనితగ ఆమెను చిత్రించుటలో స్త్రీల పాటల రచయితలు తమ తమ జీవితములు ధన్యమైన వని భావించిరి.

సీతాదేవిని గూర్చి ఈ పాటల రచయితలు తమకు గల అభిప్రాయములను లక్ష్మణునిచే, శత్రుఘ్నునిచే పలికించిరి. లక్ష్మణుడు సీతను గూర్చి-

వైదేహి లోకంపు వనితయనరాదు
ప్రకృతి బెంచిన బిడ్డ పరమ పవిత్ర

అనియును, శత్రుఘ్నునిచే - 'సీత ఆలోకమాత' అనియును శ్లాఘింపబడినది.

'స్కెచ్'

# "యూనివర్సల్ సిలబస్"

—ఇంద్రగంటి పతంజలిశాస్త్రి

ఆలోచిస్తూ ఆ రోడ్డుమీద నడుస్తోంది. నడుస్తూ ఆలోచించడం ఆమె కలవాటే. అలవాటయిపోయింది. ఆలోచించుకోడానికి ఆ సమయం మాత్రమే ఆమె కందుబాటులో ఉంది.

ఆ రోడ్డుమీద ఎన్నిసార్లు నడిచిందో!

సూర్యుడు పుట్టినప్పటి నుంచీ ఎన్నిసార్లు ఉదయించాడు? ఎన్నిసార్లు అస్తమించాడు ? ఈ లెక్కలు ఎవరు కట్టగలరు!

అసలు లెక్కల్లో భాగారం-గుణకారం-కూడిక—తీసివేత-ఈ నాలుగే! ఇవే మొత్తం లెక్కల సామ్రాజ్యాన్ని ఏలుతున్నాయిట—మాష్టారు చెప్పారు

ఈ లెక్కలేమీ సూర్యుడి ఉదయాస్తమయాల్ని తేల్చి చెప్పలేవుట-తాతయ్య చెప్పాడు.

తాతయ్య చచ్చిపోయాడు. ఈ లెక్కలు తేల్చలేక కాదు-అమ్మ-నాన్న కూడా చచ్చిపోతారుట. తనుకూడ!

ఎందుకు చచ్చిపోతారో-ఎందుకు చచ్చిపోవాలో ఎవరూ చెప్పడం లేదు. ఈ భూమ్మీద విసుగెత్తిపోయేమో!

సూర్యోదయాస్తమయాలు తేల్చి చెప్పలేనట్టే ఆ రోడ్డుమీద తానెన్నిసార్లు నడిచిందోకూడా చెప్పడం కష్టం.

రెండు మైళ్ళ రోడ్డది. రోడ్డు పొడవు ఎక్కువే! ఎన్నో పొలాలు, తోటలు-చెరువులు—కాలవలు-నదులు-కొండలు-దాటినా ఇంకా ఎంత పొడవుందో అదీ చెప్పలేం. ఆమె నడిచేది మాత్రం రెండుమైళ్ళే-ఇంటి దగ్గర నుంచి స్కూలు వరకు.

శలవు రోజుల్లోను- తుపాను వస్తేను- పండుగలొచ్చినా-తనకి ఒంట్లో బాగుండ నప్పుడు-ఆ రోడ్డు మీద ఆమె నడవదు. అంతే. మిగతా రోజులన్నీ ఆ రోడ్డులోని రెండుమైళ్ళ భాగమూ ఆమె నడుస్తుంది. అటునుంచి వచ్చేటప్పుడైనా అదే పొడవు - రెండు మైళ్ళే !

ఆలోచిస్తూ రోడ్డుమీద నడుస్తోంది-ఆమె ఆలోచించేది ఈ విషయాలు కావు.

ఈరోజు కూడా అమ్మ ఆమెను కొట్టింది. రోజూ కొడతుంది. ఆ కొట్టడం గురించే ఆలోచిస్తోంది.

తనవల్ల తప్పున్నా లేకున్నా కొడుతుంది. అలాగా ఇలాగా కాదు-ఆలా కొడుతుంది.

తనిప్పుడు పదవ తరగతికి వచ్చింది. వచ్చేలా చేశారు మాష్టర్లు.

అమ్మ కొట్టడంతో వళ్ళంతా నొప్పులయిపోయింది. ఎప్పుడూ వీపుమీదే కొడుతుంది - ఇంకా బోలెడు వళ్ళున్నా.

దవడమీద కొట్టొచ్చుగా. చేతిమీద - కాళ్ళమీద కొట్టొచ్చుగా. ఆఁహ...ఎప్పుడు వీపుమీదే !

జాకెట్టు బిగుతుగా ఉంటుందేమో-వేసుకున్నప్పుడు -అమ్మ కొట్టిన చోట మరీ బాధగా ఉంటుంది.

అందులోనూ ఆమె జాకెట్లు రోజు రోజుకీ బిగిసిపోతున్నాయి కూడా - ఎందుకో మరి! చిన్నవైపోతున్నాయేమో! ఈసారి పెద్దవి కుట్టించుకోవాలి. అవీ చిన్నవైపోతాయేమో. చిన్నవైపోతే ఇవ్వడానికి చెల్లి కూడా లేదు. అక్కవి తొడుక్కుందామనుకుంటే

అక్కా లేదు. అన్నని కాని-తమ్ముణ్ణి కాని అమ్మ కనలేదు. తనొక్కర్తే అమ్మకి పుట్టింది.

అమ్మ కొట్టిన వీపు ఇంకా నొప్పిగా ఉంది. స్కూల్లో నోట్సు చెప్పరు కనక సరిపోయింది. లేకుంటే తను రాయగలదా!

అబ్బ! ఈ కొట్టడం అమ్మ ఎప్పుడు మానేస్తుందో ఏమో! హాయిగా ఉంటుంది. మిగతావాళ్ళు కూడా వాళ్ళ అమ్మలచేత దెబ్బలు తింటారా! సుజాతా వాళ్ళమ్మ ఎక్కడ కొడుతుందో తెలీదు. లక్ష్మీవాళ్ళ అమ్మ అసలు కొట్టదేమో!

ఇవన్నీ తన కెందుకు-తన వీపు సంగతి చూసుకోక!

అమ్మ కొట్టినప్పుడల్లా తనేడుస్తుంది ఏడిచినా సరే అమ్మ కొడుతుంది. అమ్మకి జాలి-దయ ఇవేమీ లేవు. తన కూతురే కదా-ఎందుకు కొట్టడం-అనుకోదా!

తన కూతురే కనక కొడుతుందేమో!

కొట్టినప్పుడల్లా రాక్షసిలా అరుస్తుంది కూడా.

తిడుతుంది.

అవేం తిట్లో. ఆ తిట్లకి - మంత్రాల్లాగా అర్థాలు చాలా గూఢంగా ఉంటాయి.

ఒక తిట్టూ తనకి బోధపడదు. అర్థం అయిచావదు.

అవన్నీ ఎక్కడ నేర్చుకుందో మరి!

కొట్టినప్పుడల్లా చచ్చేలా కొడుతుంది.

కొట్టి-తిట్టి-చివరకి 'నువ్వు చచ్చినా బాగుండునే-ఓసారి ఏడ్చేసి-అసలు పుట్టనే లేదనుకుంటాను.'— అనేది.

అక్క-అన్న-చెల్లి-తమ్ముడు - ఎవరూ పుట్టలేదు. అందుకే అమ్మ వాళ్ళని కొట్టలేదు.

వాళ్ళకోసం 'ఓసారి' ఏడవనూ అక్కరలేదు, ఏంచేడిచినా తన గురించే-పుట్టింది కనక.

అసలు ఎందుకొట్టడుతుందో తనకి అర్థం కావడం లేదు. ఎంత ఆలోచించినా అంతుబట్టడం లేదు-సూర్యోదయాస్తమయాల లెక్కల్లాగ.

పోనీ - నిన్నటివరకు వదలెయ్యండి ఈరోజు ఎందుకు కొట్టినట్టు?

లేస్తూనే ప్రారంభించింది తిట్టడం-కొట్టడం.

నాన్న ఫాక్టరీకి వెళ్ళే సమయానికి అన్నం వడ్డించింది. కారేజీ సర్ది పెట్టింది. నీళ్లు తోడింది-ఇల్లు ఊడ్చింది.

కళ్ళాపు-ముగ్గులు - అన్నీ చేసింది. అమ్మ కట్టీ విడిచిన చీర నీళ్ళల్లో గుంజి ఆరేసింది.

ఏ ఒక్క పనీ విడిచిపెట్టలేదే! తను స్నానంచేసి-ఆరేసిన బట్టలు కట్టుకొని-అమ్మ వడ్డించిన అన్నం తింది. పుస్తకాలు సర్దుకుంది. ఇన్ని చేస్తున్నా-అమ్మ కొడుతూనేఉంది. తిడుతూనేఉంది.

జడ వేస్తూ కొట్టింది.

తిట్లయితే బాధలేదు. దెబ్బలకే తట్టుకోలేకపోతోంది. అయినా తింటూనేఉంది.

ఈ దెబ్బలు ఎప్పుడు తప్పిపోతాయో!

వెల్లకిలా పడుకుంటే రాత్రి ఎంత బాధగా ఉందో!

ఈరోజు ఉదయం అయిపోయింది. ఇక రేపు ఉదయం వరకు ఫరవారేదు. అమ్మకొట్టదు తెల్లవారితే ఊరుకోదు.

అసలు ఎందుకొట్టడుతుంది?

మళ్ళీ అదే ప్రశ్న!

రాత్రి నాన్న తాగివస్తాడు. అన్నం తింటాడు. తిని అమ్మను కొడతాడు. అమ్మ తనను కొట్టినట్టు కాదు. ఇంకా ఎక్కువే! అమ్మ వీపుమీద కొడుతుంది. నాన్నయితే అమ్మని ఎక్కడపడితే అక్కడ కొడతాడు. చితక తంతాడు. జుట్టుపట్టి నేలకి విసిరేస్తాడు.

రాత్రి చదువు పూర్తిచేసి నిద్రకోసం కళ్ళుమూసుకుని-ఇదంతా చూస్తుంది తను. బూతులు తిడతాడు.

ఆ మాటలతో అమ్మ తననెప్పుడూ తిట్టదు. ఇంకోలా తిడుతుంది. అందులో బూతులుండవు.

ఎన్నో దెబ్బలు కొట్టిన తరవాత-నాన్న పడుకొనేవాడు. నాన్న కాళ్ళు నొక్కుతుంది అమ్మ. నాన్న నిద్రపోయిన తర్వాత- అమ్మకూడా-అక్కడే నాన్న దగ్గర పడుకొంటుంది.

ఓ రాత్రివేళ తనకు మెలకువ వచ్చిచూస్తే- అమ్మ వంటిమీద చెయ్యేసి- నాన్న పడుకొని ఉండేవాడు. అమ్మ-నాన్న గుండెలకి తగిలేలా-దగ్గరగా పడుకొని ఉండేది.

ఉదయాన్నే లేచి నాన్న ఫాక్టరీకి వెళ్ళిపోతాడు! ఉదయం పూట నాన్న అమ్మని కొట్టడు. మళ్ళీ రాత్రే.

రాత్రి కూడా వంట అమ్మే చేస్తుంది. అమ్మ చేసిన వంట ఎంతో బావుందని-మెచ్చుకుంటూ మరీ తింటాడు నాన్న. తిని అమ్మను కొడతాడు. ఏడుస్తుంది. తనయితే అమ్మ కొట్టినప్పుడు-అమ్మ ఎదురుగానే ఏడుస్తుంది. అమ్మ అలా ఎదురుగా ఏడవదు. నాన్న పడుకున్నాక -కాళ్ళు నొక్కుతూ ఏడుస్తుంది. చీరకొంగుతో కళ్ళు వత్తుకుంటుంది.

నాన్న కొడుతూంటే అమ్మ చేతి గాజులు ఓసారి పగిలిపోయాయి. చేతికొకటి చొప్పున కాబోలు మిగిలాయి ఆయినా అమ్మ గాజులు వేయించుకోలేదు. మళ్ళీ-ఎందుకోమరి! అలానే ఒక్కొక్క గాజుతోనే ఉండిపోయింది

అమ్మ చెవులకేం లేవు. నాన్న కిచ్చేసింది.

బంగారం రంగువి బజార్లో అమ్ముతూంటే-కొని-చెవులికి పెట్టుకుంది. ఆ తర్వాత అవి నల్లబడిపోయాయి.

మెడలో మంగళసూత్రాలు కూడా లేవు. బాగా కొట్టినప్పుడు నాన్న కిచ్చేసింది. పసుపుకొమ్ము కట్టుకుంది.

సుమట మాత్రం-ఇంత - అర్థరూపాయి బిళ్ళంత బొట్టు పెట్టుకుంటుంది. అది నాన్న తీసుకోలేదు. తనయితే చిన్నబొట్టు-దోసగింజంత పెట్టుకుంటుంది.

ఓ రోజయితే - మంచాన్ని విరగ్గొట్టి ఆ విరిగిన మంచం కోడుతో అమ్మని కొట్టాడు. అమ్మ తెలివి తప్పి పడిపోయింది. అప్పుడు వెళ్ళి పడుకున్నాడు నాన్న.

నాన్న నిద్రపోయిన తరవాత-కళ్ళు తెరిచి- దగ్గర కెళ్ళి అమ్మ ముఖంలోకి తొంగిచూసిందామె. ఇన్ని నీళ్ళు తెచ్చి మొహంమీద చల్లింది. అమ్మకి తెలివొచ్చింది. రాత్రి కదా-అందుకని ఆమెను కొట్టలేదు- అమ్మ-లేచి కొంచెం నీళ్ళుతాగి వెళ్ళి దగ్గర పడుకొంది.

ఆమె యిటువైపు తిరిగి - కిటికీలోంచి బయటికి చూస్తూ పడుకుంది.

తెల్లవారితే తనవంతు. అయినా నిద్ర పట్టేసింది.

అమ్మ తన నెందుకు కొడుతోందో మాత్రం తేలడం లేదు-ఉదయాస్తమయాల లెక్కల్లాగ.

స్కూలు నుంచి వచ్చేటప్పుడు మిగతా పిల్లలంతా ఏవేవో కబుర్లు చెప్పుకుంటారు-నడుస్తూ. ఆమె కూడా నడుస్తుంది

కబుర్లు చెప్పదు.

వాళ్ళ కబుర్లు ఆమెకు అర్థంకావు. ఆ మాటలు వేరు. అవెప్పుడూ తను వినలేదు. వినదు. అందుకే తనగురించి ఆలోచించుకొంటుంది. ఎంత ఆలోచించినా అమ్మ ఆమె నెందుక్కొడుతుందో అర్థం కావడం లేదు-అవేవో లెక్కల్లాగా.

ఆరోజు కూడా అమ్మని నాన్న కొట్టాడు. అమ్మా -నాన్న కలిసే అన్నం తిన్నారు.

తిన్న తరవాత తిట్టాడు. బూతులే!

కొట్టాడు. బాగాకొట్టాడు. మళ్ళీ తెలివితప్పి పడిపోయిందమ్మ.

వెళ్ళి నాన్న పడుకున్నాడు.

ఆమె లేచి అమ్మదగ్గర కెళ్ళింది. నీళ్ళు చల్లింది-మొహంమ్మీద. కొంచెంసేపు తర్వాత లేస్తుందదే అనుకుంది. నీళ్ళు తాగి నాన్న దగ్గరకెళ్ళి పడుకుంటుందిలే-అనుకుంది.

అమ్మ లేవలేదు.

ఇంకాస్సేపు చూసింది.

అమ్మ లేవలేదు.

చాలా రాత్రయ్యేవరకు అమ్మదగ్గరే కూర్చుంది.

అమ్మ లేవలేదు.

మళ్ళీ లేవలేదు !

* * *

నాన్నకి అన్నం వడ్డిస్తోందామె. తింటూ ఏడుస్తున్నాడు.

ఎందుకేడుస్తున్నావు నాన్నా అని అడిగింది.

ఏడుస్తున్నాడే గాని చెప్పలేదు నాన్న.

అమ్మ చచ్చిపోయిందనా ! అడిగింది.

కాదే అన్నాడు ఏడుస్తూనే.

మరి-చేతులా చంపేశానని ఏడుస్తున్నావా !

మళ్ళీ అడిగింది

భోరుమన్నాడే గాని- అవునని గాని, కాదనిగాని, అనలేదు.

తిన్నంతసేపు ఏడుస్తూనే ఉన్నాడు.

ఏడుస్తూ పడుకున్నాడు.

నిద్రలో కూడా ఏడుస్తున్నాడు.

* * *

మంచంమీద మధ్యలో రెండు మోకాళ్ళమీద తల పెట్టి కూర్చుంది. కళ్ళల్లోంచి నీళ్ళు కారుతున్నాయి.

ఏమిటో ఆలోచిస్తోంది.

ఇప్పుడు రెండు మైళ్ళ రోడ్డుమీద నడవడంలేదు. ఇంటిదగ్గరే కూర్చొని ఆలోచిస్తోంది.

రోడ్డుమీద నడవాల్సిన అవసరం లేదు. పది పాసయింది తనే పాసయింది. ఈ వార్త వినకుండానే అమ్మ చచ్చిపోయింది. ఆ స్కూల్లో ఇంటర్మీడియట్ లేదు. రెండు మైళ్ళ రోడ్డుమీద నడవాల్సిన అవసరం లేదు.

ఇంటిదగ్గరే ఆలోచిస్తోంది.

అమ్మ లేదు. తనని కొట్టడానికిప్పుడు అమ్మలేదు.

నాన్నచేత దెబ్బలు తినడానికి అమ్మలేదు.

బతికున్నన్నాళ్ళు దెబ్బలు తింది. కొట్టింది.

వీపు తడిమి చూసుకుంది. హాయిగా ఉంది.

గోడవార నాన్న విరగ్గొట్టిన మంచం తాలూకు మంచంకోడు అలా పడి ఉంది. చెదలు పట్టేస్తోంది. అమ్మ చచ్చిపోకుండా ఉంటే మంచంకోడు చెదలు పట్టదు.

తన వీపు అంత హాయిగా ఉండదు.

తనతో చదువుకున్న (మగ పిల్లల గురించి అప్రస్తుతం) ఆడపిల్లలందరికీ ఇంచుమించు అందరికీ అమ్మ నాన్నలున్నారు.

తనకే లేదు.

తనని కొడితేఏం !

నాన్న చేత తింటే ఏం !

అమ్మ అమ్మే !

ఇప్పుడా అమ్మ లేదు.

ఎంత కొట్టినా, అమ్మా అని పిలిస్తే ఏంతపనిలో ఉన్నా పలికి వెనక్కి తిరిగి చూసేది - దీనంగా - నిస్సహాయంగా.

ఎంతగా దెబ్బలు తిన్నా - నాన్న వచ్చేవరకు అన్నం తినకుండా ఉండి - నాన్నతో కలిసి తినేది. తనకూ లేదు - ఆ నాన్నకూ లేదు - లేకుండా పోయింది.

వీపు మీద దెబ్బలు లేకపోవడం బాగానే ఉంది. నాన్నచేత దెబ్బలు తప్పిపోవడమూ బాగానే ఉంది

అమ్మ లేకపోవడం మాత్రం బావులేదు.

బాధగానే ఉంది.

అమ్మ కొట్టినప్పుడు తను పడిన బాధకంటే ఎక్కువ బాధగా ఉంది.

ఓసేయ్ - ఇదిగో - నిన్నే - అని కాక సత్తాలూ అని పేరు పెట్టి మరీ కొట్టే వారు. ఆ పిలుపు విని మురిసిపోతూనే దెబ్బలు తినేది అమ్మ.

తనని తిడతే ఎలా తిట్టేదీ - తన బతుకునీ తన మొహాన్నీ - తన అమ్మ కడుపునీ - ఉదహరిస్తూ తిట్టేది.

ఎంత తిట్టినా - ఎన్ని కొట్టినా - కొట్టినన్నాళ్ళు ఆమెకి అమ్మ ఉంది.

బతికున్నన్నాళ్ళు నాన్న చేత దెబ్బలు తింటూ రోజుకి ఒకసారి చచ్చేది. చచ్చి సుఖపడింది. ఆమె మాత్రం బతికుండే సుఖపడలేక పోతోంది అమ్మ లేదని - !

నువ్వు చచ్చినా బాగుండును. ఓ సారి ఏడ్చేసి - పుట్టలేదనుకుందును - అన్న ఆ అమ్మ చచ్చిపోయింది. తను బ్రతికే ఉంది.

అందుకే ఆ బాధ !

కొట్టినా ఫరవాలేదమ్మా - భరిస్తాను - నువ్వు మాత్రం బ్రతికుండాలమ్మా - అంటూ ఏడుస్తోంది. బ్రతికివస్తుందా ! రాదని తనకూ తెలుసు.

ఏడవకు నాన్నా ఏడిస్తే బ్రతికి వస్తుందా ! ఏడవకు. పిచ్చినాన్నా ఏడవకు ! అంటుంది నాన్నతో.

అది చచ్చిపోయిందే -

నీకు అమ్మ లేకుండా చేశానే- అమ్మా అని పిలవడానికి లేకుండా చేశానే- అంటూ గుండెలు పగుల కొట్టుకుంటాడు !

అమ్మ తననెందుకొట్టేదో ఇప్పటికీ అర్థంకావడం లేదు. అసలు నాన్న - అమ్మనెందుకొట్టేవాడో అదీ అర్థం కావడంలేదు

ఎవరు చెప్పగలరు.

భూతవైద్యుడికి చెబితే - ఏదో పిశాచం ఆవహించిందంటాడు.

జ్యోతిశ్శాస్త్రజ్ఞుడికి చూపిస్తే- వక్రగ్రహాలు - దుష్టగ్రహాలు పీడిస్తాయి- పూజలు- శాంతులు చేయించమంటాడు వైద్యుడికి చూపిస్తే - ఇదోరకం మానసిక రుగ్మత - మానసికశాస్త్రరీత్యా చికిత్స చేయాలంటాడాయన !

తాగి వచ్చిన మొగుడిచేత దెబ్బలు తినితిని- అనురాగం పొందలేక ఆలా పిచ్చదై పోయిందిరా - అంటుంది — లోకం.

పోనీ దేవుడినే అడిగితే - ! పురాకృతకర్మ- అనుభవించాలి. -అది పరిపక్వం అయిన తర్వాత మోక్షం సిద్ధిస్తుంది- అంతవరకు నన్ను స్మరిస్తూండండి - అంటాడు. ఇక ఫైనల్‌గా - ఈ రచయితనే అడిగేస్తే.... మరేం లేదు - కుసంస్కారం- అదే మన వెనుకబడిన తనానికి కారణం అవుతోంది - అంటాడు.

ఇటు చూసి- అటు చూసి - ఓ రోజు ఈ రచయితనే మళ్ళీ అడిగిందామె-

మాస్టారూ ! అసలు "చట్టం" ఎందుకండీ ! అని.

మనిషి జీవితాన్ని క్రమబద్ధం చేయడానికి- మనిషి మనుగడకి రక్షణ ఏర్పరచడానికి- అని చెప్పాడు రచయిత.

అంతటితో ఊరుకోలేదామె.

"అయితే మనిషి వీటన్నిటినీ తనకు తానే ఏర్పరచుకుంటే- చట్టం అవసరం లేదా!"

అని మళ్ళీ అడిగింది.

"అంతేకదా మరి"

ఏదో ఆలోచనలో పడిపోయి

ఈమెకి ఈ సమాధానం తియ్యగా- తృప్తిగా కనిపించిందే గాని- సొల్యూషన్ మాత్రం దొరకలేదందులో -

అలా వెళ్ళిపోయింది.

వీటన్నిటిలోను ఏది నిజం ! అన్నీ నిజాలుగానే కనబడుతున్నా నిజం మాత్రం ఒకటే ఉంటుంది. రెండు రెళ్ళు నాలుగులాగ !

సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు- సిలబస్‌లో రాస్తుంది, అదెంతవరకు నిజం!

మనం పిలిచే సూర్యోదయాన్నే మనకు తూర్పున ఉన్న దేశాలు అ స్తమయం అంటాయి!

మళ్ళీ ఈ పేచీ ఏమిటి!

ఒకే సంఘటనని— ఓ దేశం సిలబస్‌లో అ స్తమయం అని మరోదేశం సిలబస్ లో ఉదయం అని- అనడం ఏం న్యాయం !

ఏ సిలబస్ యదార్థం!

పరీక్షల్లో ఇలా రాస్తే ఈదేశం మాస్టర్లు మార్కులు వేస్తారు!

ఇది తేలని సమస్య!

నిజం అనేది కూడా తేలని సమస్యే!

అమ్మ ఎందుకు దెబ్బలు తినేదో-

తననెందుకు కొట్టిందో- ఇవి కూడా తేలని సమస్యలే-

ఉదయా స్తమయాల లెక్కల్లాగా.

ఏది నిజమయినా- ఏది నిజం కాకపోయినా-

ఏ దేశం సిలబస్ ప్రకారం చూసినా- అమ్మచచ్చి పోవడం మాత్రం నిజం!

అక్షరాలా నిజం !

ఇది యూనివర్సల్ సిలబస్!

అన్నట్టు ఇప్పుడు నాన్న తాగడం మానేశాడు. అమ్మకోసం ఏడ్చి - ఏడ్చి ఆ కన్నీళ్ళు తాగుతున్నాడు !

నీకు అమ్మలేకుండా చేశాను - నాకు మాత్రం అమ్మవై నిలిచావే - అని మళ్ళీ ఏడుస్తాడు.

ఎవరికీ ఏమీకాకుండా చచ్చిపోయింది - అమ్మ - పిచ్చి అమ్మ !

ఆమెను అమ్మ అని పిలుచుకుంటూ ఏడుస్తాడు నాన్న - పిచ్చినాన్న... !

తను.........!

పలాస - 532221
శ్రీకాకుళం జిల్లా

దక్షిణ భారత ప్రెస్

తెలుగు, హిందీ, ఇంగ్లీషు భాషలలో ముద్రణా సౌకర్యము కలదు.

చిరునామా :

దక్షిణభారత ప్రెస్,
ఖైరతాబాద్, హైదరాబాద్ - 500 004
ఫోన్ నం. 34417

# నేటి కవిత్వంలో అనుభూతీ అన్వేషణా

—కేతవరపు రామకోటిశాస్త్రి

అనుభూతి అన్నా అనుభవమన్నా ఒకటిగానే అనుకొంటున్నాం. జీవిత జన్యమైంది అనుభవమనీ హృదయ అగాధాలలోనుంచి మేల్కొనేది అనుభూతి అనీ రెండింటినీ వేర్పరచి కూడా కొందరు చెబుతున్నారు[1]. అనుభూతి కొరకు అన్వేషణ చేయవచ్చు. అసలు అనుభూతిగానీ అన్వేషణగానీ దేనికో ఒకదానికి సంబంధించి దేన్నో ఒకదాన్ని గురించిమాత్రమే వుంటాయి గానీ మరి దేనితోనూ నిమిత్తం లేకుండా వాని కవిగా విడిగా వుండవు. ఆవిధంగా వుండటానికి వీలు కాని అనుభూతీ అన్వేషణా అనేవి రెండూ మూడో విషయంతో గానీ వస్తువుతో గానీ కాక తమకు తామే అన్యోన్య సంబంధంలో ఒకటిగా వుండటమన్న విలక్షణత్వాన్ని పురస్కరించుకొని అనుభూతివాదమనేది ఒకటి బయలుదేరింది.

కవిత్వం జీవితం కొరకు జీవితం నుండి పుట్టి పెరిగేది. అందువల్ల కవిత్వానికి జీవితానుభవమే ఉత్పత్తి స్థానం. అనుభవం హృదయం లోతులను స్పృశిస్తూ మేల్కొల్పుగా ఉండటం కూడా అది కవిత్వం కావటానికి అవసరమే కనుక కవిత్వానికి అనుభూతీ అందుకు తగిన అభివ్యక్తీ రెండూ ముఖ్యమే అన్యోన్యాశ్రయ లక్షణం చేత అనుభూతివాద కవిత్వంలో అభివ్యక్తి ఎంత ముఖ్యమో అన్వేషణకూడా అంతే ముఖ్యం. అనుభూతి వాదకత్వంలోని అనుభూతి వైయక్తికం. కవి వ్యక్తిగా తన స్థితిని ప్రమాణికంగా చేసుకొని ప్రపంచాన్ని గురించిన కొన్ని పారమార్థిక సార్వత్రిక సత్యాలను అన్వేషించి పట్టుకొని వాటిని ఆవిష్కరిసాడు.

రెండవ ప్రపంచయుద్ధం ముగిసిన తరువాత శాస్త్ర సాంకేతిక విజ్ఞాన రంగాలలో జరిగిన పరిశోధనలవల్ల వచ్చిన విప్లవకరములయిన పరిణామాల ఫలితంగా ప్రపంచ దేశాలన్నీ ఆ విలక్షణ విజ్ఞానరంగం మీద గుత్తాధికారం గల దేశాల పలుకుబడికి లోబడి మనుగడ సాగించవలసిన పరిస్థితుల్లో పడ్డాయి ఈ పరిస్థితుల ప్రభావాలు దరహం మీద మానవ జీవిత ముఖాలనన్నింటిని ప్రభావితం చేశాయి. ఈనాడు ప్రపంచమంతా అటు పెట్టుబడిదారి విధాన ధోరణితోనూ, ఇటు సామ్యవాద విధాన ధోరణితోనూ, నిండి రెండుగా విడివడివుంది. అటో ఇటో మొగ్గ చూపని ఆలోచన పద్ధతి ఈనాడు లేదు సాహిత్యకళా సాంస్కృతిక భావజాలాలలో కూడా ఆ మొగ్గు కనిపిస్తూనే వుంటుంది. అది అనివార్యం. కాల్పనికవాదం మానవతావాదం, హేతువాదం, అస్తిత్వవాదం, అభ్యుదయవాదం, అధివాస్తవికవాదం, ప్రకృతివాదం-మొదలయిన సాంస్కృతిక భావధోరణులు ఆధునిక కాలంలో చాలా వచ్చాయి. ఎన్ని వచ్చినా అన్నీ మొత్తంమీద అటు భావవాద తాత్త్విక దృక్పథానికో, ఇటు భౌతిక దృక్పథానికో చెందేవే కాని వేరుకావు. అయితే కలగాపులగం కావచ్చు అంతమాత్రమే. అను

[1] 25-9-1982 ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుండి ప్రసారితం

భూతివాదం భావవాద దృక్పథానికి చెందిన ఒక ధోరణి౨.

అనుభూతికి జ్ఞానమే మూలం. అయితే జ్ఞాన విజ్ఞాన ప్రపంచం ఒక్కరకంగా వుండదు. లోకజ్ఞానం శాస్త్రజ్ఞానం- కావ్యజ్ఞానం- తత్వజ్ఞానం- ఈ విధంగా అనేకరకాల స్థాయిదశాభేదాలతో వుంటుంది. ఎన్ని రకాలుగా వున్నప్పటికీ దరహం మీద జ్ఞానం కూడా రెండే రెండు రకాలు. ఒకటి శాస్త్రీయం. రెండోది అశాస్త్రీయం. భావవాద శాస్త్రీయతా లక్షణం వేరు. భౌతికవాద శాస్త్రీయతా లక్షణం వేరు. అసలు భావవాదము శాస్త్రీయమా, భౌతికవాదము శాస్త్రీయమా అన్నదానితో జోలి మనకిక్కడ అక్కరలేదు. ఇంతకూ జ్ఞానముయొక్క ప్రాథమిక స్థాయి దశ ఎక్కడున్నదంటే ఇంద్రియాల ద్వారా బాహ్య ప్రపంచ వస్తు విషయ సంబంధం మనిషికి ఏర్పడటంలో వుంది. నిజమే కానీ- కేవలం ఇంద్రియాల ద్వారానే- బాహ్య ప్రపంచ సంబంధంవల్లనే- మనిషి సరియైన జ్ఞానాన్ని పొందుతాడని చెప్పటానికి వీలులేదు. అందువల్ల ప్రాథమిక జ్ఞానస్థాయి దశలో కనుక తప్పంటే అందువల్ల కలిగే అనుభూతిలోనూ తప్పంటుంది. అనుభూతి సరియైనది కాకపోతే దానిమీద ఆధారపడి చేసే అన్వేషణ కూడా సరియైనది కాకుండా పోతుంది. నేటి కవిత్వంలో ఆంతర్ముఖీనమైన ఆత్మానుభూతుల అన్వేషణలతో అనుభూత వాదమనే పేరుమీద కొంత బలమైన కవిత్వం వస్తున్నది.

కళనూ సంగీతాన్నీ అనుభవిస్తాను గాని అర్థం చేసుకోలేను- అని ఎవరో మహానుభావుడన్నట్లుగా ఒక సూక్తిని చెబుతుంటారు. ఆ రెండింటినే కాదు- మరి దేన్ని కూడా అర్థం చేసుకోకపోతే తనకు గడవని పరిస్థితిలేని ఒక ఆభిజాత్య తరగతి పెద్ద మనిషిని ఉబ్బవేయటానికి వాని అజ్ఞానాన్నే వానికి అలంకారమనిపించేటట్లుగా ఎవరో బుద్ధిమంతుడు ఆ వాక్యాన్ని చెప్పివుంటాడు. ఎందుకంటే నిజానికి మనిషికి అర్థం చేసుకోదలచిన బుద్ధి వుంటే- అందుకనువైన పరిస్థితులుంటే- అర్థంకాని విషయమంటూ సృష్టిలో వుండదు. ఏదైనా దాన్ని అర్థం చేసుకోవలసిన అవసరం మనకెంతగా వుంటే అది మనకంతగా అర్థమవుతుంది అనుభూతివాద తీవ్రతలో ప్రపంచంలో ఏదో అర్థం చేసుకోవలసింది లేదన్న ధోరణి స్ఫుర్క వుంటుంది.

ఇంద్రియాధీనమూ, వ్యక్తిగతమూ అయిన అనుభూతి ఎవరిది వారిదే కదా! ఒకరి అనుభూతికి మరొకరు ప్రమాణము కాలేరు కదా! కవిత్వంలో వున్న అనుభూతి విశేషము కవిది. అది ఆయనకు వ్యక్తిగతము. దానికాయనే ప్రమాణంగనుక దీని కితరులతో సంబంధం వుండదు. అది పెట్టుకోలేదు. తమ కవితల్లోని అనుభూతులను పాఠకులు అందుకోలేకపోవటం అది తమ ఆధిక్యానికి ఒక గుర్తుగా అనుభూతి వాద కవులు ఒక్క విచిత్రానుభూతిని పొందవచ్చు. కవులు కవిత్వం వ్రాసేది- పాఠకులూ, శ్రోతలూ అయిన సోదర మానవులను ఒక విలక్షణమైన భావ ప్రపంచంలోకి లాగి ఉద్వేగాలను కలిగించటంద్వారా వారు జీవిత వాస్తవికతల నెరిగి సర్దుకొని మార్చుకొని బ్రతకడం నేర్చుకోటం కొరకు. అనుభూతివాదంలో ఈ లక్షణం లేకపోవటంవల్ల వైజ్ఞానిక నాయకత్వం పోటీలో అనుభూతివాద కవులుందరు.

కవిత్వంలో అనుభూతి వుంటుందా వుండదా? వుండాలా వుండనక్కరలేదా అన్నవి కావు విచారణీయాంశాలు. అనుభూతి విశేషాల అభివ్యక్తి మాత్రమే కవిత్వమన్నది నిజమా అన్నదొక్కటే విచారణీయాంశం. ఇల్లా అనటంచేత కవిత్వానికి అనుభూతికీ వున్న సంబంధం విషయంలోవ్యతిరేకాభిప్రాయమున్నట్లర్థంకాదు. దేని విషయంలోనైనా దాని చారిత్రక పరిస్థితుల ప్రభావాల అవగాహననుండి తదనుగుణంగా అనుభూతి అనేది కలుగుతుంది. కలగాలి. అప్పుడది శాస్త్రీయ జ్ఞానస్థాయి నందుకొంటుంది, అలా అందుకొన్నది

శాస్త్రీయమైన ఆలోచనకూ, అన్వేషణకూ ప్రేరకంగా వుంటుంది. కవిత్వానికీ అనుభూతికీ వున్న సంబంధం అలాంటిది. అది సజీవ సంబంధం అందువల్లనే ప్రేరకత్వ శక్తినది ప్రసవించగలుగుతుంది. కవిత్వం వ్రాయటానికి కవికి అన్వేషణబుద్ధి బలంగా వుండాలి. అదే మెదడు శక్తి అంటే, అయితే కవి దేనికొరకు అన్వేషించాలి? ఆయా దేశకాల పరిస్థితుల ప్రభావాల నుండి ప్రజలకు ప్రపంచాన్ని విశదం చేయటం గురించీ, వ్యాఖ్యానించటం గురించీ అర్థంచేసుకోవడం గురించీ, మార్చుకోవటం గురించీ చెప్పటమెలాగా అని అన్వేషించాలి. కానీ అనుభూతివాదంలో అంతర్గతంగా వుండే అన్వేషణ లక్షణం వేరు. అస్తిత్వవాద ధోరణిలో వ్యక్తియొక్క అన్వేషణ బుద్ధికి పదును పెట్టటమనే మాట ఉన్నది. అక్కడ అది వ్యక్తి సామాజిక స్వభావాన్ని గాక వైయుక్తిక జీవిత లక్షణాన్ని పట్టుకొని అంతర్ముఖీనమై ఆత్మను ఆత్మచేత దర్శించు పరమ శివుని తపస్సులాగా వుంటుంది. అనుభూతివాదంలోని అన్వేషణ లక్షణ మదే. ప్రవృత్తి యోగ రూపమైన వాస్తవిక లోకానుభూతులకు అనేక కారణాల చేత విముఖత్వాన్ని భజించినవారు నివృత్తి యోగరూపమైన ఆత్మానుభూతులకు అభిముఖులై అంతర్ముఖీనులయినారు. కాల్పనికవాద అస్తిత్వవాద కవితా ధోరణుల పరిపక్వస్థాయిగా శుద్ధ కళావాదంగా అనుభూతివాదం నేటి కవిత్వంలో భావవాద సాంప్రదాయిక ధోరణులను కొత్తరకంగా పోషించుకుంటూ వస్తున్నది వాస్తవిక ప్రాపంచిక స్థితిగతులతో గల ప్రతికూల సంబంధాల ఫలితంగా అనుభూతివాదం బయలుదేరింది.

"పద పోదాం జీవన తంత్రుల్ని సడలించి దాన్ని అవతల పెడదాం. ఇవాళ ఒక ఆత్మ వెయ్యి బాల బాలికలుగా మారి విశాల శాద్వలాల అమలిన హాయిలో పరుగులెత్తేలా చేద్దాం. అన్ని కవితలూ చదువుదాం. అన్ని కథలూ తిరిగేద్దాం. మంచిపీ చెడ్డపీ అన్నీ సోమరితనపు తూలికా శయ్యలు కోమలంగా దొర్లిద్దాం ఆజంతా చిత్రరేఖల్లాంటి అవయవాల్ని కాస్సేపు జీవితపు కోరల్లో నుంచి బయటికి వచ్చి మరచిపోయిన ఊపిర్ని మళ్ళీ పీల్చుద్దాం. కాస్సేపు జీవితంలో నుంచి నిజాల్ని ఖాళీ చేద్దాం శరణార్థుల్లా వర్తమానం నుంచి పారిపోదాం"

కంతోగల అననుకూల సంబంధానుభూతుల ఊహాపోహాలుగా ఉన్న ఈ కవిత్వం అనుభూతి పేరు మీద పలాయన తత్వాన్ని ప్రబోధిస్తున్నదా? అన్నట్లున్నా కవి ఆంతర్యం సందర్భంగా అర్థం చేసుకోటం మీద ఆధారపడి అందులోని అనుభూతి సాంద్రతనూ అంతర్ముఖీనతనూ కవి ఔషధంగా సేవించమంటున్నాడా కాక అదే అందుకోవలసిన లక్ష్యంగా చెబుతున్నాడా అన్నది తేలుతుంది. నేటికాలపు కవిత్వంలోని అనుభూతివాద సాంద్రతకు కాల్పనిక అస్తిత్వ వాదాలతోపాటు భారతీయమైన అద్వైత విశిష్టాద్వైత తాత్విక ధోరణులు కూడా దోహదం చేశాయి.

కాలానికి సుదూర తీరానగల మాధుర్యస్వామి అయిన ఆనందమోహినిని పొందటానికి జ్యోతిర్మయ జీవులు పడే తపనను బలంగా చెప్పగలిగిన కవిత్వం అనుభూతిమయత్వాన్ని కాక అన్యత్వాన్ని భరించలేదు.

"కాళిదాసు ఊహకన్నా
శంకరుని అనుభూతికన్నా
బలమైన కొత్త వ్యోమగామిని
అతిమనోలోక నిశ్రేణిక"[4]

ఆనందమోహినీ సౌందర్య సంపత్సంభావనమెంత ఆంతర్ముఖీనమైన ఆత్మానుభూతియో దానికపసరమైన సాధక లక్షణం కూడా అంతే అనుభూతిమయం. ఈ కవిత్వంలో అనుభూతి అన్వేషణ రెండూ కలిసిపోతుంటాయనటం ఇందువల్లనే ఈతపనంతా ఎందుకంటే దేశకాలాలచేత నిర్దిష్టమవుతున్న జీవిత వాస్తవికతల

నుండి వైదొలగటానికి. దీన్నే కవి అయితే కాల ప్రవాహాన్ని దాటెయ్యటానికి అని చెబుతాడు. అంటే ఇదంతా ఆత్మభావవాద అంతర్ముఖీన ప్రాతిపదిక మీద కవిత్వమన్నమాట.

ఏదో వెతుక్కుంటున్నాను ఎన్ని యుగాలుదాటెనో
నావాక్కు నా అభివ్యక్తి నా నూత్న శబ్దచిత్రాలు
రోజుకో అవతారమెత్తగా నాకు నాకే ఆశ్చర్యమై
ఏదో వెతుక్కుంటున్నాను ఎదచెప్పనేలేదు దాన్ని.

అనుభూతిరూపమైన అన్వేషణ ఇంత అస్పష్ట మధురంగా వుంటుంది,

యాంత్రిక నాగరికత యొక్క అభివృద్ధి రూపంగా వస్తున్న శాస్త్ర సాంకేతిక విజ్ఞాన నాగరికతా స్థాయి వల్లను, సామ్యవాద విప్లవ శాస్త్రీయ ధోరణుల వల్లనూ, వ్యక్తిగా మనిషికి ప్రాధాన్యం రోజు రోజుకు తగ్గుతున్ననేటి ప్రాపంచిక వ్యవస్థలో సమిష్టి మానవతా తాత్విక దృక్పథానికి సుముఖులు కాని మేధావులు లోకానుభూతులకు విముఖంగానూ ఆత్మానుభూతులకు సుముఖంగానూ కవిత్వంలో అనుభూతివాదాన్ని సిద్ధాంతంగా ప్రతిపాదిస్తున్నారు. జీవిత ప్రపంచాన్ని మార్చుకొనే ప్రయత్నం ఎంత కష్టభూయిష్టమైందో దాన్ని తప్పించుకొన్నట్లూ దూరంగా ఎత్తున ఎక్కడోవున్నట్లు ఊహించుకొని వ్యాఖ్యానించుకొనే ప్రయత్నం అంత సుఖంగానూ సులభసుందరంగానూ వుంటుంది. ఊహతో ఇంత చమత్కారాన్ని సృషించగలగటం అదే కళ. వాస్తవికతను విముఖత్వం భజించి కూడా అనుభూతివాదకవిత్వం కవిత్వం కాగలుగుతున్నదంటే ఇందులో వున్న అచమత్కారకళ వల్లనే. అది ఏమాత్రంగా వుంటే ఆ కవిత్వం ఆ మాత్రంగా వుంపుంటుంది. ఆశలూ ఆదర్శాలూ నిరాశలూ నిస్పృహలూ ఆచరణతో నిమిత్తంలేని ఆలోచనలు నిర్దిష్ట వస్తుసంపదనూ సౌందర్యాన్ని గూర్చిన అన్వేషణలు అనిశ్చితత్వంగా ఆయోమయత్వంగా అనుభూతివాద కవిత్వంలో అభివ్యక్తిని పొందుతాయి. ఈ నేటి కవిత్వంలో కనిపించే ఆత్మాధిక్యభావం నిజానికది ఆత్మన్యూనతాభావాన్ని వ్యతిరేకముఖంగా ప్రకటించటం తప్ప మరొకటికాదు. ఈ రకమైన ఒక అకుకు అందని పోకకుపొందనిఅవాస్తవికవిలక్షణఆత్మ జీవితదృక్పథం గురించిన ఊహాపోహలు నేటి అనుభూతివాద కవిత్వానికి అవసరమైన వస్తుసంపద.

ప్రపంచమంతా రెండు- భావవాద భౌతికవాద- దృక్పథాలుగా విడివడి స్పష్టంగా కనిపిస్తున్న ఈ నేటి కాలంలో అనుభూతివాదం రెండింటిలో నేనేదీ కానంటుంది అంటుంది కాని నిజానికి భావవాద తాత్విక దృక్పథంలోదే అనుభూతివాదం. అందువల్లనే ఆది శంకరులనుండి అరవిందులవారి వరకు వచ్చిన తాత్విక యోగదర్శన శాస్త్రమంతా అనుభూతివాద కవిత్వానికి వ్యుత్పత్తి కాగలుగుతున్నది.

నేటి తెలుగు కవిత్వంలో అనుభూతులనూ అన్వేషణలనూ కలగాపులగంగా గ్రుచ్చియెత్తి అనుభూతివాద కవిత్వమనేదానికి ఉనికిని సంపాదించిన తెలుగు కవుల్లో ఇస్మాయిల్ కవినే ముందుగా చెప్పాలనిపిస్తున్నది. తిలక్ పేరునూ శేషేంద్ర పేరునూ చెప్పాలనటం కూడా వుంది. కానీ అది వాళ్ళిద్దరిలో ఏ ఒక్కరూ కూడా సరిగ్గా పట్టనంత ఇరుకైన ఒకచిన్న భావధోరణి పాయ మాత్రమే నిజంగా అనుభూతివాదం అభ్యుదయవాదమంత కాకపోయినా కనీసం కాల్పనికవాదమంత లోతుపాతులు కలిగింది కూడా కాదు. అయితే పైకి చెప్పినా చెప్పకపోయినా కవిత్వంలో అనుభూతియొక్క తీవ్రతరాభివ్యక్తికి నిరంతరాన్వేషణపరులయిన నిబద్ధులయిన తెలుగు కవులు ఇస్మాయిల్ తరువాత వేగుంట మోహనప్రసాద్, ఇంద్రగంటి శ్రీకాంతశర్మ, సుప్రసన్న, మాదిరాజు రంగారావు, అజంతా మొదలయిన గట్టివాళ్ళు మరికొందరున్నారు. ఈ అనుభూతులతోనూ అన్వేషణలతోనూ కూడిన అనుభూతివాదానికి శాస్త్రసిద్ధాంత స్థాయిని సంపా

దించే ప్రయత్నం కూడా శ్రీకాంతశర్మ సుప్రసన్నా మొదలయినవాళ్ళు కొంత చేస్తున్నారు.

అవ్యక్త మధురమైన అనుభూతినీ, అనిర్దిష్టమైన అన్వేషణనూ ఆలంకారికమైన కలయికగా చేసి అభివ్యక్తిలో ఆధునికతనూ అందాన్నీ సంతరించి అనుభూతివాద కవులు నేటి కవిత్వంలో తమవంతు కవిత్వాన్ని తాము వ్రాస్తున్నారు అనుభూతినీ అన్వేషణా అనే కవిత్వానికి కావలసిన రెండు గుణాలూ గల అనుభూతివాదం భావవాద తాత్వికతనుండి మెదడునూ హృదయాన్నీ మిళితం చేసే మహాకావ్య నిర్మాణం కోసం మథనం చేస్తున్నది. నేటి కవిత్వంలో ఒక భాగం ఈ మథనం

1. సోమసుందర్ — ఇస్మాయిల్‌గారి చెట్టు నా ఆదర్శం పుస్తకానికి వ్రాసిన వెన్నెలరేఖ పుట .43
2. నందిని సిద్దారెడ్డి — ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న దోరణులు పుట 62
3. గుంటూరు శేషేంద్రశర్మ - నీరై పారిపోయింది పుట 48 49
4. సుప్రసన్న - ఋతుంభర పుట 2
5. ,, ,, పుట 65


# దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర

హైదరాబాదు-500 004

1983 ఫిబ్రవరిలో జరుగు సభ ప్రారంభిక పరీక్షలకు పరీక్షా శుల్కము పంపు తేదీలు :

విలంబ శుల్కము లేకుండా 15-12-1982

విలంబ శుల్కముతో 25-12-1982

కార్యదర్శి.




సమీక్షా వ్యాసం

# 'ఆధునిక తెలుగు సాహిత్యవిమర్శ : సాంప్రదాయిక రీతి'*

డా. హెచ్. ఎస్. బ్రహ్మానంద

'ఊర్ధ్వోర్ధ్వ మారుహ్యాయ జాతం
ధీః పశ్యతి శ్రాంతిమవేదయంతీ
ఫలం తదాద్యైః పరికల్పితానామ్
వివేక సోపాన పరంపరాణామ్'

—అభినవ భారతి

The true spirit of criticism is to seek in a literature, what we can find in it, great or beautiful, but not to demand from it, what it does not seek to give.

—Aurobindo.

డా॥ కోవెల సంపత్కుమారగారు సుప్రసిద్ధ విమర్శకులు సహృదయులు. వారు డాక్టరేటు పట్టంకోసం కాకతీయ విశ్వవిద్యాలయానికి సమర్పించి 1978లో డిగ్రీని పొందిన పరిశోధక వ్యాసం పై గ్రంథం. పై గ్రంథానికి ఈ వ్యాసం సమీక్ష.

ఈ గ్రంథాన్ని సమీక్షకు గ్రహించడంలో రెండు ప్రధాన కారణాలున్నాయి: 1. తెలుగులోని సాహిత్య విమర్శ సిద్ధాంతాల్ని గుర్తించిన మొదటి రచన కావడం 2. తెలుగులో విమర్శ "పాశ్చాత్య సాహిత్య అధ్యయనంతో ప్రారంభమైన ఒక సాహిత్య ప్రక్రియ అయినా, అందులో ఉన్న ఆలంకారిక సంప్రదాయానుస్యూతిని గుర్తించి చర్చించిన మొదటి ప్రయత్నం కావడం.

గ్రంథ స్వరూపం:

రచయిత గుర్తించినట్టుగా "ఇది సాహిత్య విమర్శ కాదు... సాహిత్య విమర్శను గూర్చిన పరిశోధన పూర్వక విశ్లేషణాత్మక వివేచనయిది". (పుట v) తన వ్యాస పరిమితిని, ప్రణాళికను పాఠకునికి స్పష్టంగా అందించడానికి ఈయన చేసిన ప్రయత్నం తెలుగుశాఖల్లో పరిశోధన చేస్తున్న యువకులకు చాల ప్రధానంగా అనుసరించదగింది. (పుట v-xi) ఈ వివేచన సహృదయులకు సమర్పింపబడింది. అవిచ్ఛిన్న సంప్రదాయార్థులకై ఉద్దేశించబడింది. గ్రంథం విశ్వనాథవారికి అంకితం చేయబడ్డది. "చేయటం ఏదో ఆచార మాత్రంగా చేసింది కాదు. విశ్వనాథ ఒకడు. చకచ్చకిత సర్వజీవచైతన్యోద్దీపక సాహిత్యాకృతి, ఆకార వాచ్యుడు, వాగ్దేవీవైభవ దివ్యకావ్య విశ్వవిధాత, ఆయన వాక్చైతన్యం జీవల్లోక సమాదర భావిత సద్వస్తునిష్ఠమైంది. కాబట్టి అంకితానికి యోగ్యుడాయనే. జీవుని వేదనాగ్నులు సృజించిన సాహితీభావన- కావ్య పరమార్థ దర్శనం - ఇవి సత్యనారాయణ తెలుగువాడికిచ్చిన సహృదయ సంపద. అంచేత విశ్వనాథ వారికి ఈ గ్రంథం అర్పించబడింది. (చూ. సమర్పణ పద్యాలు.)

ఈ గ్రంథకర్త కేవలం విద్యాలయాల్లోని పడికట్టు చదువుకి పరిమితమైపోయిన వాడుకాడు. స్వయానా రచయిత సాహిత్యంలోని ఆనుపానులు తెలిసినవాడు. అందుకే విశ్వనాథను వరించాడు. విమర్శలో సాంప్రదాయిక రీతిని గుర్తించడానికి మనః పరిపక్వత చాల అవసరం. సంపత్కుమార గారి జీవలక్షణం ఈ గ్రంథ రూపాన్ని పొందింది.

---

* ప్రచురణ : కె. అరవిందబాబు 15-729/1 రామన్నపేట వరంగల్లు, (1981).

ఈ గ్రంథంలో 13 అధ్యాయాలు, రెండు అను బంధాలూ ఉన్నాయి. 1, 13 అధ్యాయాలు వరసగా ప్రవేశిక, సమాపనం (13వ అధ్యాయంలో ఆత్యాధునిక తెలుగు సాహిత్య విమర్శ ప్రసక్తమైంది. దీని విష యం తర్వాత చూడవచ్చు.) 2వ అధ్యాయం ఆధునిక సాహిత్య విమర్శారంభానికి సంబంధించినది. 3-12 అధ్యాయాల నడుమ పది ఖండాల్లో సాహిత్య విమర్శ రీతులు, దృక్పథాలూ, చర్చించబడ్డాయి. మొదటి అనుబంధంలో పరిశోధనకుకావల్సిన నిజమైన లక్షణం విషయ సేకరణకు సంబంధించి ఉంది. మూడు లేఖల్ని సంపాదించి ముద్రించారు. అవి వింజమూరి రంగాచార్యులు (1976); బసవరాజు అప్పారావు (1933); రాయప్రోలు సుబ్బారావు (?) గార్లు రాసిన వుత్తరాలు. అవి మనకు పరిచయంలేని ఎన్నో క్రొత్త విషయాల్ని చెబుతున్నాయి. రెండో అనుబంధం (దీన్ని అనుబంధంగా చెప్పాల్సిన అవసరం లేదు) ఉపయుక్తవాఙ్మయాన్ని ప్రదర్శించింది.

సంపత్కుమారగారి మౌలికత ప్రథమాధ్యాయంలో కనిపిస్తుంది. అది "విమర్శ" శబ్దాన్ని గురించిన చర్చ. ఈ చర్చ ఇంతకుపూర్వం వచ్చిన ఏ విమర్శ గ్రంథంలోనూ కనిపించేది కాదు. మన తెలుగు సాహిత్య విమర్శ ఒకవైపు కావ్యాలకాంర సంగ్ర హాన్ని; మరోవైపు కవిత్వ తత్త్వ విచారాన్ని నమూనా లుగా గ్రహించి సాగింది. సాగుతోంది. కావ్యాలంకార సంగ్రహం 'విమర్శ'ను భరతానందాభినవుల మార్గం లోని తాత్త్విక దృక్పథంతో చర్చించదు. కవిత్వతత్త్వ విచారం సాహిత్యేతర విషయ ప్రాధాన్యం కలది కావ డంతో విమర్శకుడి 'బాధ్యత', సాహిత్యంలో సామా జిక చరిత్ర, కవి భావన ఇత్యాదులకి వచ్చిన ప్రాధా న్యం "విమర్శ" తత్త్వానికి రాలేదు. విమర్శకులుగా స్థిరపడ్డ రాళ్లపల్లివంటి వాళ్ళెవరూ "విమర్శ"ను విమ ర్శించలేదు. ఒక అర్థం ప్రజాభిప్రాయంగా స్థిరపడి పోయింది; "గుణదోష మీమాంస" పురాణం సూరి శాస్త్రిగారి వంటివారూ పాశ్చాత్యాభిప్రాయాలతో భార తీయాభిప్రాయాలు సన్నిహితంగా ఉన్నాయని గుర్తిం చారే తప్ప "విమర్శ" Criticism పర్యాయవాచకా లవుతాయాకాదా! అన్నది మీమాంస చేసినవారు కారు. విశ్వనాథవంటి బహుముఖ ప్రతిభాశాలికీ ఈ 'విమర్శ' అన్న పదంమీద అంత పట్టింపు ఉన్నట్టు కనిపించదు. ఆయన రాసిన విమర్శ గ్రంథాల్లో చాలా మందికి విమర్శ కనిపించదుకూడా. పాటిబండ వంటి వారూ "శైలి" అనే మాటను వాడకుండా "శిల్పం" (విశ్వ నాథ ఉపజ్ఞే ఈ మాట కూడా) అన్న అంశాన్ని ప్రచారంలోకి తెచ్చారు. ఈనాడు మనలో చాలమంది అనుశీలన; దర్శనం; వివేచన; సహృదయ స్పందన, ఇలాంటి మాటల్ని వాడుకోవడం గమనించవచ్చు. మరి విమర్శకు గ్రీకు పదమైన Krieten(judege) ధాత్వర్థసామ్యంతో సంబంధం ఉందా! లేక 'judge-ment' అనే అర్థం కేవలం పాశ్చాత్యమైన భావాను కరణమా ! అన్నది మొదటిసారిగా ఈ గ్రంథంలోనే చర్చకు వచ్చిన విషయం.

విమర్శ: దేవి: కవిసహృదయ సంబంధం.

విమర్శ శబ్ద వివృతిలో సంపత్కుమార ఒక సంప్రదాయాన్ని గుర్తించడానికి ప్రయత్నించారు. లలితా సహస్ర నామాల్లో ఓం విమర్శ రూపిణ్యైనమః అని వుంది. (చూ. ఈ గ్రంథం పుటలు 1-4)

విమర్శరూపిణి దేవి అని దాని తాత్పర్యం. మాతృకావివేకమనే గ్రంథం "విమర్శ అనగా వాచ కమను శబ్దము" అని చెప్పింది. ఈ విషయాన్ని గుర్తిస్తూ సంపత్కుమార ఇలా అన్నారు.

విమృశ్యమైన పరబ్రహ్మమునకు తచ్ఛక్త్యుద్భాసిత మైన లోకము విమర్శ రూపము" అని.

సాహిత్యరంగానికి దీన్ని వర్తింపచేస్తూ

"కవి యనగా రసభావములను విమర్శించువాడని" భట్టగోపాలుడు చెప్పాడంటూ,

"కాగా, విమర్శయన్నది కావ్యావిష్కృతికి పూర్వముగా, కావ్యానుభూతికి పరముగా సాగెడు విశేష ప్రక్రియ. ముందుసాగునది కవియందు, తరువాత సాగునది సహృదయుని యందు (పుట 2)

అని నిర్వచిస్తూ అభినవగుప్తపాదులు చెప్పిన "కవి సహృదయాఖ్యం విజయతే" అన్న లోచన ప్రారంభ శ్లోకాన్ని ప్రమాణంగా స్వీకరించారు.

అలా రచయితలో; సహృదయుడిలో సమానంగా జరిగే "ప్రత్యవమర్శా" లక్షణాన్ని విమర్శగా గుర్తించడం ఈ గ్రంథంలో ఒక అపూర్వ విషయం. కవిలోనే సహృదయుడు ప్రథమావతారాన్ని పొందుతాడనటానికి వాల్మీకిని స్మరించడం కూడా వీరిలోని మౌలికతకు నిదర్శనమే. ఆలాగే భరతమునినాట్యశాస్త్రాన్ని కూడా భారతీయ సాహిత్య విమర్శకు నాందిగా గుర్తించడం కూడా. అలాగే కావ్యావతారికలు విమర్శకు మూలరూపాలనటం కూడా.

విషయ వివేచన :

3వ అధ్యాయం నుండి ప్రతి అధ్యాయంలోనూ ఒక పరస పాటించబడింది. కట్టమంచితరం (వెన్నేటి, వింజమూరి, పురాణం సూరిశాస్త్రి, బసవరాజు అప్పారావు ప్రభృతుల తరం) నుంచీ 1) ఆధునిక సాహిత్య విమర్శన (ఆలంకారికపద్ధతి కన్నారూపంలో భిన్నమైంది) ఎలా పరిణమించిందో అంశాలదృష్ట్యా చెప్పడం. 2) తర్వాత ఆలంకారిక సంప్రదాయాల్ని చర్చించడం 3) భేదాలో సాదృశ్యాలో చూపడం. ఇలా చెయ్యడంలో ఆయన రెండు ప్రయోజనాల్ని ఊహించినట్టు కనిపిస్తుంది. 1) తెలుగు సాహిత్య విమర్శలో ప్రభవించిన క్రొత్తభావాలు - పరిభాష వీటిని చర్చించారు. 2) ఆలంకారిక సంప్రదాయ పరిభాషకున్న అర్థవిస్తృతిని వ్యాఖ్యాన పరిధిని నిర్ణయించి ఆయా విమర్శకులు తెలిసివాడినా; తెలీకవాడినా అవి అ విమర్శకుల "భారతీయత"ను ఎలా వ్యంజిస్తున్నాయో చెప్పడం. దీన్నే వారు సంప్రదాయానుస్యూతిగా భావించింది.

మూడవ అధ్యాయం కట్టమంచివారి కవిత్వతత్త్వ విచారానికి సంబంధించింది కట్టమంచి (తరం)వారు ప్రచారంలోకి తెచ్చిన క్రొత్తమాటలు భావనాశక్తి; నాటకసరణి; కథైక్యం: అపూర్వ కథాసంవిధానం; ఆలంత్రికవులు; కాలహేతు సరణులు; పాత్రచిత్రణము; నానా భావాభ్యుదయం; నానారసాశ్రయధోరణి, రసమిశ్రణం; రసంప్రదర్శితం కావడం; అభిరుచి స్థిరంగా నిల్పడం; వాతావరణం (వింజమూరి)-ఇత్యాదులు.

ప్రతి అంశం మీదా సంపత్కుమారగారు చేసిన వ్యాఖ్యానం వారికున్న విశాల గ్రంథ పరిచయాన్ని; సంప్రదాయావగాహనను సూచిస్తున్నా పనికట్టుకొని ప్రతి పరిభాషకు వెనుకవున్న లోతుల్లోకి వెళ్ళి-ఇది మూలమంటూ ఒక సమయం ఆ అర్థంలో అది ఒక విమర్శలో అతక్కపోయినా ఇది ఆ విమర్శకుని సంప్రదాయానుస్యూతి అనడం కొంత ఆలోచింపచేస్తుంది.

ఇంతకీ సంప్రదాయానుస్యూతి అంటే ఏమిటి? (సాంప్రదాయిక రీతి అనేమాట ద్వారా వారుద్దేశించింది ఇదే భావాన్ని కావటంవల్ల) రీతి అంటే ప్రసారమన్నది మౌలికార్థం - ఋగతే -)

కట్టమంచివారు తెలుగులో మొదటి ఆధునిక విమర్శకుడన్న అభిప్రాయం చాలామంది పండిత విమర్శకులు వ్యక్తం చేశారు. ఎస్.వి.రామారావు (1974)తో పాటు సంపత్కుమార కూడా — కట్టమంచికి ముందే తెలుగు సాహిత్య విమర్శ, పాశ్చాత్య ప్రభావ జన్యమైందని నిరూపించారు. ఇటీవల బ్రహ్మానంద (1982) కావలి వెంకటరామయ్య (1859) లోనే ఆధునికమైందంటున్నారు. ఇది కాలసరణి.

కాని సంప్రదాయం రసస్వరూపంలాంటిది. దీనికి హేతుసరణి అడ్డంకాదు. వివేకానంద ఒక చోట చెప్పి

నట్టు "భారతీయత" ఒక భావవికల్పం మాత్రమే. అంటే ఒక ఆలోచనా విధానమని అది కట్టమంచి లోనూ వుంది. శ్రీశ్రీలోనూ వుంది. అది లేని భారతీయుడెవడూ లేడు-అన్న ప్రత్యయంతో నిరూపిస్తే కట్టమంచిలోని సంప్రదాయానుస్యూతిని నిరూపించాల్సిన మార్గం వేరు. అపుడు కవిత్వతత్త్వ విచారాన్ని ప్రత్యంశ ఖండన మండనలు చేయాల్సిన అవసరమూ గ్రంథ ప్రయోజన దృష్ట్యా అవసరం కాదు. ఆయనే చెప్పారు — "My soul is swadeshi" అని. ఆయన రస-ప్రతిభ-భావన-అన్నమాటల్ని కేవలం పాశ్చాత్య వాసనతో అన్నారు తప్పా-ఆయన భరతానందాభినవుల్ని దృష్టిలో వుంచుకొని అనలేదు. మరి ఇక్కడ సంప్రదాయానుస్యూతి ఆయా పరిభాషలకు అలంకార శాస్త్రాలలో ఉన్న అర్థవిస్తృతి నుంచీ ఏర్పడుతున్నది కాదు. పరిభాషను యథాతథంగా వాడుకొంటున్న వాళ్ళమీద ఏమాత్రం సంప్రదాయ ప్రభావాన్ని ఊహించలేని సందర్భాలున్నాయి. ఆలాంటప్పుడు సంప్రదాయానుస్యూతి అంటే ఏం చెప్పుకోవాలి?

సంపత్కుమారగారు గ్రంథరచనలో మొత్తం, అంతటా ఈ సమస్యను feel అయ్యారు. లసలు వ్యాసం పుట 87 లో మొదలవ్వాలి. అవుతోంది. అక్కడికి వచ్చేటప్పటికి సంపత్కుమారలోని ఆలంకారికాత్మ మేల్కొన్నది.

"కాని రసమన్నది భారతీయ సాహిత్య విమర్శలో రూపొందినది." (పు 87)

సరిగ్గా కట్టమంచి నుంచి - ఈనాటి మసదాకా- అందరూ గుర్తిస్తూ వాడుతుంటున్నమాట 'రసం' (ఆదే పుటలో రసశబ్ద అర్థవిచారం కూడా వుంది, చూడొచ్చు) ఆనాటి నుంచి ఈనాటిదాకా మనవాళ్ళు ఆత్మనా అంగీకరించని విషయాలు పాశ్చాత్యాలు రెండు వున్నాయి.

అవి ఇవి :

1. కేవల భావవాదం 2. కేవల వస్తువాదం. ఆటు ప్లాటోనీ, ఇటు ఆరిస్టాటిల్‌ని భారతీయులు ఎప్పుడూ పూర్తిగా అనుసరింపలేదు. శంకరుడు ప్లాటోతుల్యుడు, చార్వాకులు, సాంఖ్యులు, అరిస్టాటిల్ సహోదరులు. వైదికభావన వస్తుభావ సమన్వయాన్ని ఆశించింది. కాశ్మీర శైవాగమ, ప్రత్యభిజ్ఞా, స్పంద మార్గాలు, ఈ వైదిక భావాన్ని సమగ్రంగా ఆవిష్కరించాయి. 'రస' చర్చ ఆ పరిధిలోనిది. అందేతనే క్రింది అంశాలు తెలుగు సాహిత్య విమర్శలో జాతీయం కాలేదు.

1. రసానికి ఉన్న క్షాళన (Cathartic)ధర్మం. 2. సజాతీయ కామం (homo-sexul relationship). 3 అమలిన శృంగారం(platonic love?)

పాశ్చాత్య దేశాల్లో ఎక్కడా మచ్చుకు కూడా కనిపించని అంశం : రసం అభివ్యక్తమవుతున్నదని; స్థాయి పురుషరూపమని; వాగంగ సర్వాభినయం స్థాయికి వ్యంజకమని దేవీస్వరూపమని వెరసి రసం బ్రహ్మానంద సహోదరమని ఇది religions experience కాదు. sentimentalism కాదు. emotional blart కాదు. symbolism + classicism + social Realigy = రసం.

కట్టమంచి 'రసం' అనే పదాన్ని ఈ అర్థంలో వాడాడా! వాడకపోతే ఆయనలో సంప్రదాయానుసూ చోటే లేదు. కట్టమంచి సరిగా Mathew-Arnold లాంటివారు సాహిత్యాన్ని సామాజిక చరిత్రకు వ్యంజకంగా గ్రహించి సాహిత్యోద్ధరణ సమాజసంస్కరణ సమానమని భావించిన 'realist'. ఆయన ఆత్మసామగ్రిలో పై అంశాలన్నీ గర్భీకృతంగా లీలగా ఉన్నాయి. ఆ అర్థంలో ఆయనలో సంప్రదాయస్యూతి వుంది. ఆయన గ్రహించిన పరిభాషలో కాదు. చేసిన విమర్శలో అంతకన్నా కాదు. అందుచేతే ఆయిన చేసిన సామాజిక విమర్శ - సవ్యకవి

త్వానికి; వ్యతిరేకముఖంగా విశ్వనాథాదుల "రస" వాదానికీ-ప్రేరకమైనాయి. ఆ దృష్టిలో నిర్ద్వంద్వంగా ఆధునిక సాహిత్య విమర్శ ఆయనలోనే మొదలైంది. ఇది పాశ్చాత్య ప్రభావజనితమైన వస్తుతత్త్వంలో మొదటి అంశం.

కట్టమంచి వారిని గురించి మాట్లాడేటప్పుడు పింగళి లక్ష్మీకాంతంగారినీ రాళ్ళపల్లివారినీ కూడా కలుపుకోవాలి. రాళ్ళపల్లివారు మిశ్రపాత్రల్ని ఒప్పుకోకపోవడంతో (చూ. పు. 81) వారిపైన ఉన్న ఇతిహాస పరిజ్ఞాన ప్రభావం కారణం.

4 వ అధ్యాయం రాళ్ళపల్లివారిని ఉద్దేశించింది. కావ్య 'కళకు' సంబంధించినది. ఇది కేతన, అంతకు పూర్వం సోమన ప్రయోగించిన మాటలు (చూ పుటలు 98 343) కట్టమంచివారిలాగే శర్మగారుకూడ ప్రభావంలో పడ్డా; దువ్వూరి రామిరెడ్డిగారిలాగే భారతీయతను మరికొంత ఎక్కువపాళ్ళలో వంటబట్టించుకొన్నవారు. కాని శర్మగారిది కూడా ఒక విమర్శన మార్గం కాలేదు. కాని ఆయన రచనాశైలి- విమర్శక రంగంలో ఒక ఒరవడిని ఏర్పరచింది. అది వేరు విషయం.

శర్మగారిలోని సంప్రదాయానుస్యూతి విషయకంగా సంపత్కుమార గుర్తించిన ప్రధానాంశాలు ఇవి.

"భావ-వస్తు-రచనలు మూడును కళాంశములు. ఇవి పరస్పర సమన్వితములై లయాన్వితమును సమిష్టిగా రూపొందుట ఉత్తమ కళాలక్షణము. శర్మగారు భావమునకిచ్చిన ఈ ప్రాధాన్యమంతయు పూర్వులు భావించిన రసమార్గమున సాగుచుండుట గమనించవలసిన యంశము.... అయితే స్థాయీ భావములుగా' గుర్తింపబడిన కొన్ని భావములకే పూర్వులు రసత్వము భావించగా శర్మగారు 'ఏ భావములకైనను అనుటతో కొంత భేదము సమాపతితమైనట్లుగా కనిపించును." (పుట 102, 107).

రసానంతత్త్వపై ఖరి రుద్రటాదుల్లో ఉన్నా-వారినే అనుసరించే వారయితే శర్మగారు ఇలా రాస్తారా!

'తర్కశాస్త్ర పరాధీనులగు మన లాక్షణికులు వాదవివాదములు బెంచి ఎవరో వ్రాసిన రసలక్షణమునే స్థాపింపబూని రసశబ్దము మార్గము సంకోచ పరిచిరి.' (సారస్వత వ్యాసములు పు. 127)

అంచేతనే సంపత్కుమారగారు కూడా - పుటలు 107-112ల్లో భావానికి, రసానికీ, వాటి అనుభవాలకీ ఉన్న కక్ష్యాభేదాల్ని విచారణాత్మకంగా చర్చించారు.

సంపత్కుమారగారి ప్రకారం భావం 'రసచర్చలో' వస్తువు ధ్వని మార్గంలోనూ; రూపక వివేచనా సందర్భంలోనూ చర్చించబడ్డాయనీ భావ వస్తువు(రచనల్ని?)ల్ని విభజించి క్రమపద్ధతిలోకావ్యాల ననుశీలించుట శర్మగారు చూపిన ఆధునికత (పుట 112) అంటున్నారు.

—శర్మగారిని సాంప్రదాయకుడంటే ఎంతవరకూ సమన్వయిస్తుందంటే భావప్రాధాన్యాన్ని - రసమనే పేరిట వాడటంవరకే - అంతేకాని ఆయన రుద్రటాదుల మార్గంలోని వాడు అనడం అనవసరం.

మరి ఆయన విమర్శమార్గం - ఒక బాణీగా నిల్చిందేమోకాని సిద్ధాంతం కాలేదు. కారణం- అటు పాశ్చాత్యంలో కాని, ఇటు అలంకారిక సంప్రదాయంలోకాని - వారికి సమగ్రమైన అవగాహన లోపించడమే.

5వ అధ్యాయంలో దువ్వూరి రామిరెడ్డిగారి "రస రామణీయక" మార్గం- విచారించబడింది సంపత్కుమారగారు రెడ్డిగారిపైనవున్న పాశ్చాత్య ప్రభావాన్ని చర్చించారు. అలా వుంచి - ఆయనది "సమన్వయ ధోరణిగా సంపత్కుమార గుర్తించారు. బసవరాజు అప్పారావు, పురాణం సూరిశాస్త్రి మొ॥ వారందరూ ఆనాడు కోరబట్టింది- ఈ ధోరణినే.

కట్టమంచివారు కవిత్వతత్త్వ విచారం చేస్తే - ఈయన నిరూపణం చేశారు. వీరి తరం మొత్తంమీద Romantic కవుల భావవాద ప్రాబల్యం ఉంది. కవిత్వాన్ని నిర్వచించడానికి ప్రయత్నించడం కావ్యాన్ని కాదు.

సంపత్కుమారగారు సంప్రదాయానుస్యూతి అంటున్నారు కాని- రెడ్డిగారిలోని ఈ భావనా విధానం ఎక్కడిది చెప్పండి.

"రసములు మానవచర్యలకే సంబంధించి యుండు ననియు, తిర్యగ్జంతువుల చేష్టలందు రసస్పర్శ కల దనియు, అచేతనవస్తువర్ణనములు రసాభాసములనియు ఆలంకారికులు చెప్పుచున్నారు.

—క.త.ని. పు. 43

రసాన్ని కావ్యాత్మకాదని కూడా ఆయనే రాశారు. (పు. 27).

"రసనీరసత్వములు కావ్యసమర్పిత వస్తువుల చేతనాచేతనములకు సంబంధించి యుండక కేవలము అలౌకిక కల్పనా చమత్కృతియొక్క భావాభావములపై నాధారపడి యుండును. రసమునకు చమత్కారమే ప్రాణమని విశ్వనాథుడు నుడివియున్నాడు". (పు. 43-44)

మరి జగన్నాథుడి నుంచీ "రామణీయకాన్ని", విశ్వనాథుడినుంచీ ''చమత్కారాన్ని'' గ్రహించిన వాడైతే 'రసం' కావ్యాత్మకాదనడంలో అర్థంలేదు. ప్రతిభను కావ్య"జీవిత"మని; భావనను "కావ్యాత్మ" అని అనడంలో ఆయనలో ప్రధానీకరింపబడుతున్నది Coleridge అవగాహనే.

కాని ఒక విషయంలో ఆయనలోని భారతీయత కనిపిస్తుంది. "సౌందర్యము రేపు శక్తి వస్తువునకు దాని నెఱుగవలయునను బుద్ధికి నుండవలయును" అనడంలో - ఆయనలో జీర్ణించిన ఉమర్ఖయామ్ సౌందర్య తత్త్వం-(తార్కికంగా లొంగనిరసానుభవ హృదయం) మిశ్రితంగా వుంది ఇక్కడ ప్రాచ్య పాశ్చాత్య భేదం లేదు.

దువ్వూరి రామిరెడ్డిగారిలో భావకవివిమర్శకుల్లో లేని ఒక అదనపు అంశంవుంది: అది ఇది.

"కవి తనకు మాత్రమిష్టమయిన వస్తువును, భావము చేయుటకు ప్రయత్నించుటకన్న...(P. 128)"

ఇక్కడ ఒక అంశం గుర్తు పెట్టుకోవాలి. తెలుగు సాహిత్య విమర్శ-పుట్టింది పాశ్చాత్యకాల్పనికోద్యమ భావవాద ప్రభావంతో. కట్టమంచి—గురజాడ - రాయప్రోలు- దువ్వూరి-రాళ్ళపల్లి-వీరందరి మీద ఈ ఉద్యమ ప్రభావం-ప్రత్యక్షంగా-పరోక్షంగా రెండు విధాలా పడింది. రొమాంటిక్కులు నియోక్లాసిసిస్టు ధోరణులకు అక్కడ లోనైనట్టే ఇక్కడ కూడా ఉత్తరోత్తరా భావవాదులంతా అలంకారశాస్త్రం వైపు వెళ్ళిపోయారు. సమన్వయ దృష్టి అలా రూపు దిద్దుకొంది.

ఇక్కడే 6వ అధ్యాయం మొదలవుతుంది. పురాణం సూరిశాస్త్రి ఈదృక్పథానికి ప్రతిబింబం. ఆయన వేసిన బాటప్రక్రియకు సంబంధించింది. ప్రాచ్యపాశ్చాత్యాల్లో సమాన భావాల్ని వెదుక్కోవడానికి ఆయన ప్రయత్నించారు. అంతే తప్ప- అవి పరస్పరం ఎలా భిన్నాలో-ఆలోచించ లేదని ఆయనే చెప్పుకొన్నారు. బసవరాజు అప్పారావుగారితో ఒకరూపాన్ని పొందింది. ఈ దృష్టి. అది విశ్వనాథ వంటివారు పుట్టేదాకా— ఒక స్రవంతిగా, సాగి తర్వాత వస్తు తత్త్వమీమాంస గతితర్క దృష్టి పెరగడంతో సంప్రదాయ అభ్యుదయ మార్గాలుగా చీలిపోయింది.

7వ అధ్యాయం ఉదాత్త రసభావనకు సంబంధించింది. సమన్వయ దృష్టి-కొంచెం బలపడి, "మన నిత్య జీవితముతో-జీవన లక్ష్యముతో ఈ కవితకున్న సంబంధ మెట్టిది?"-అన్న ప్రశ్న వేసుకోవడంలోనే

అక్కిరాజు ఉమాకాంతంగారు 'రస' చర్చలో మరొక అధ్యాయాన్ని ప్రారంభించారు. వ్యాకరణాలంకార మార్గాలు ఎంతగా ఆయన్ని ప్రభావితం చేశాయో ఆయన సూత్ర పద్ధతిని బట్టి తెలుసుకోవచ్చు. భావ కవిత్వం మీద ప్రధానంగా ఆయన విమర్శ.

పంతులుగారు ఉదాత్తరసాలకు ప్రతినిధిగా శృంగారాన్ని గ్రహించారు. రసాల ఉదాత్తానుదాత్త చర్చ ప్రాచీను లెవరూ చెయ్యలేదని సంపత్కుమార అభిప్రాయం (P. 146) కాని ఉదాత్త, ఉద్ధత, మహారస మీమాంస అభినవుల ద్వారా ప్రసిద్ధం. శాంత రస విషయంగా (నే.కా క. P. 167)-కూడా పంతులు గారు-అనంతర కాలంలో రసాల లిస్టులో అది చేర్చ బడ్డదని అభిప్రాయ పడ్డారు-"వేదాంత జిజ్ఞాసులకు సంపూర్ణంగా బలం ప్రాప్తించిన తర్వాత-'' అని రాయడం నిదర్శనం.

ఉదాత్త భావోన్మీలనం - ఉదాత్తరసత్వాన్ని నిర్ధరించే ప్రమాణంగా పంతులుగారు స్వీకరించారు. ఇది 'ప్రీత్యావ్యుత్పత్తిపుదమ్' అన్న భరతోక్తిని పాదుగా తీసుకొన్న దృష్టికాదు. పాశ్చాత్య విమర్శలో ఉన్న 'valne' కల్పించిన ప్రభావం; అందుకే ఆనందాన్ని "ధర్మాధర్మ వ్యవస్థిత"మని ఆయన గుర్తింపు. (p. 171) కళ కళకోసం అనే దృష్టిని ప్రధానంగా నిరాకరించబడంలో పర్యవసించింది ఈధర్మచర్చ. అలా సంప్రదాయానుస్మృతి- భావ కవిత్వానికి వ్యతిరేకంగా పుట్టిన" "విమర్శ" ద్వారా బహిర్గతమైంది. దీనికి సూచిక —

'కనీసము, మానవుని అనుభూతులను సంస్కరింప జాలని కళ కళగా చెప్పబడజాలదు. (preface నేకాక).

దీన్ని సమగ్రంగా ఆవిష్కరించింది మాత్రం విశ్వనాథవారే.

8 వ అధ్యాయం "నిర్మాణ శిల్పాన్కి" చెందింది. నండూరి బంగారయ్య ప్రతినిధిగా గ్రహింప బడ్డారు.

"కావ్యవస్తువును ప్రపంచించు చాతుర్యముల నిర్మాణ శిల్పమనుట యుక్తము". (p. 36. సంప. 156).

ధ్వని-ని 'స్ఫురణ / గోపనము' లన్న అంశాల ద్వారా చర్చించాలని అనడంలో, ఆనందుడి ప్రతిపాదన ఆధునికీకరింపబడ్డది.

ఆశ్రయశిల్పాన్ని ప్రత్యేకంగా గుర్తించడంలోనూ; ధ్వన్యైక్య రసైక్యాల్ని భిన్నంగా చర్చించడంలోనూ ఆయనలో 'Westernised thinking' ప్రధానీకృత మౌతోంది. (చూ. పుట. 170, సూచిక 30) అభిజ్ఞాన శాకుంతలంమీద ఈయన చేసిన విమర్శకు ఖండనమే విశ్వనాథవారి "అభిజ్ఞానత". రసానికున్న తత్త్వనేపథ్యం - నిర్మాణంలోని సంధిబంధం - ఇవి విశ్వనాథగారు విప్పిచెప్పిన అంశాలు.

9వ అధ్యాయం "రమ్యాలోకం" - రాయప్రోలు గారిని గురించి చర్చిస్తుంది. సంపత్కుమార గారి విశ్లేషణనుబట్టి రాయప్రోలువారి "భావ" ప్రపంచం సకల వేదోపనిషన్మత సమన్వయ జనితమైంది అమలిన శృంగారానికి వారిచ్చిన నిర్వచనం చూసుకో వచ్చు. (పు. 193).

సంపత్కుమార చేసిన వ్యాఖ్యానమంతా సంప్రదాయానుస్మృతి అయితే విశ్వనాథవారు అమలిన శృంగారాన్ని ఆదరించివుండాలి. ఆనాడు శృంగార రసంమీద (ప్రబంధాలలోని)అంత ఏహ్య భావాభిప్రాయం ఏర్పడటానికి శృంగారం, భారతీయ గార్హస్థ్య జీవితంలో సాధిస్తున్న ప్రయోజనం ఎలాంటిదో చెప్ప డానికి ఆనందకుమారస్వామి వంటి వారు అంతగా శ్రమించటానికి; కారణం సన్యాసమతమై శాంకరం దృష్ట్యాప్రసిద్ధంగారసదృష్టిఅర్థంచేసుకోబడి వుండటం.

ఇటీవల బ్రహ్మానంద (1982) ప్లాటో తత్త్వ సంప్రదాయం - తరువాతి లిరుక్కులలోని అమలిన శృంగార దృష్టికి ఎలా ప్రేరకమైందో చర్చించాడు. రాయప్రోలువారే తృణంకణ పీఠికలో గుర్తించినట్లుగా "మలినము కాజాలదని భావం" - అని మనమూ గుర్తించాలి.

అయితే ఇంత సమన్వయమూ - సంపత్కుమార గారికి ఎలా కుదిరింది? 'Paralle' దొరకడం చాలా రకాలుగా దొరుకుతుంది. ప్రాచ్యపాశ్చాత్యాలు మానసిక విభేదాలుగా ఈనాడు గుర్తిస్తూండటం ఇందుకే (చూ. బ్రహ్మానంద 1981, 1982). కవిగా తాత్త్వికుడుగా రాయప్రోలు భిన్నకక్ష్యల్లో నిలబడి వుండటమే దీనికి కారణం. వారుసంప్రదాయాన్ని తెలియని వారు కారు. చాలా గ్రంథాలు చదివిన వారైనా మనకి అభ్యంతరంలేదు. స్నేహం - శృంగార అమలినత "చిదంశ" భూతమైనా మనకి అంగీకార్యమే. రమ్యాలోక మాధురీదర్శనాల్లో కనిపించని అంశం "సామాజిక దృష్టి:- అది వాస్తవికపు పునాదుల్నించి కట్టబడ్డ భవనం కాదు. అదొక "భావ" ప్రాధాన్యవాదం. ఒక శంకరుడో - ప్లాటోమహాశయుడో వెనుక వుండి నడిపించిన మార్గమిది. అంచేతనే విశ్వనాథవంటివారు సంప్రదాయ పునర్నిర్వచనం చేయాల్సిరావడం (చూ. బ్రహ్మానంద 1973).

అలంకారశాస్త్ర వికాసం-తెలుగు విమర్శ

మానవల్లి, తాతా సుబ్బారాయశాస్త్రి మహోదయుల వంటి వారి ద్వారా నాట్యశాస్త్ర ధ్వన్యాలోక లోచనాది మూలవాఙ్మయం తెలుగువారి అవగాహనలోకి వచ్చేదాకా జరిగిన సాహిత్య విమర్శ-సామూహికంగా-పాశ్చాత్య భావవాద పదజాలంతో ప్రేరితమైంది. అదృష్టాంనే రసాన్ని (emosion అని) సంకుచితార్థంలో చర్చించినవే, మొదటిసారిగా పంతులవారు. వేదులవారు, జమ్ములమడక వారూ- అలంకారిక మూలవాఙ్మయాన్ని తెలుగు చేశారు. ఇది సైద్ధాంతికబలంగానూ, రామకృష్ణ వివేకానందారవిందుల వంటి ఆర్ష మత ప్రచారకులు, కోట వేంకటచలం, ఉమామహేశ్వర పండితులు మొదలైనవారి నూత్న దృక్పథాలవల్ల ఏర్పడ్డసంస్కృతీ పునరవగాహనను తాత్త్విక నేపథ్యంగానూ - 'సంప్రదాయ పునరుద్ధారకులు' పుట్టారు. వీరికి విశ్వనాథ పాదు, ప్రేరకుడూ అయ్యారు. జీవుని వేదన, రసం, వైదిక దృక్పథం- ఇవిమూడూ గంగాయమునా సరస్వతుల్లా విశ్వనాథలో కలిసిపోయాయి.

ఈ సంప్రదాయ పునరుద్దరణంలో భాగంగానే సంప్రదాయ పునర్నిర్వచనం జరిగింది. పాటిబండ మాధవశర్మగారు, జి.వి. కృష్ణారావుగారు, తుమ్మపూడి కోటేశ్వరరావుగారు, రామకోటిశాస్త్రిగారు. సుప్రసన్న జి. వి. సుబ్రహ్మణ్యం; సంపత్కుమారవంటివారి రచనలు చేసిన పని ఇదే.

ఇలా విశ్వనాథవారు ఇచ్చిన ఉద్దీప్తి- అటు సృజనలో, ఇటు విమర్శలో సాంప్రదాయిక శాఖ అని ఒకదాన్ని తయారుచేసింది. సంపత్కుమారగారి గ్రంథం ఆ మార్గంలో వచ్చిన ఉత్తమోత్తమగ్రంథం. అంచేత ఆయన 'సాంప్రదాయికరీతిని' గురించి ఆలోచించాల్సి వచ్చింది.

(విశ్వనాథవారి మీద సంపత్కుమార వ్రాసిన విమర్శ పరమ ప్రామాణికం. దానిమీద చెప్పాల్సింది ఏమీలేదు చూ. 10, 11 అధ్యాయాలు).

వస్తు తత్త్వ మీమాంస - సంప్రదాయ మూలాలు

సంపత్కుమార శ్రీశ్రీ గారితో మొదలైందని భావిస్తున్న సంవిధాన సామాజిక దృక్పథం ఒకరోజున వచ్చింది కాదు. కట్టమంచితో మొదలైన చారిత్రక దృష్టి; గురజాడతో పెరిగిన వస్తు(పదార్థ)జిజ్ఞాస- అనుభవవాదం- శ్రీశ్రీలో మొదటిసారిగా గతి తార్కిక దృష్టిని సంతరించుకొని- మార్క్సియ దృక్పథంలో-

కవిత్వాన్ని గురించి కాకుండా- 'వస్తువు'ను గురించి మాట్లాడ్డం మొదలుపెట్టింది. ఇందులోనూ సంప్రదాయస్మృతి వుంది[1]. కాని "సంవిధాన" మనేమాట కుంతకుడి నుంచి ఎరువు తెచ్చుకోవటం వల్లకాదు. శ్రీశ్రీ వాడిన శిల్పం, రసం, ధ్వని, ప్రతిబింబం మొదలైన పదాలకు మూలాలు అలంకారశాస్త్రంలో కన్పించవు. ఎన్నడో లెనిన్ "ప్రతిఫలన" సిద్ధాంతంలో చూసుకోవాలి వాటిమూలాలు. ఇది విశ్వనాథాదులు ప్రతిపాదించే వస్తుభావ సమన్వయ దృక్పథం కాదు. కేవలం వస్తుదృష్టి, శాస్త్రదృష్టి, రసదృష్టి కాదు— చైతన్యదృష్టి (చూ. వెల్చేరు నారాయణరావు 1978).

శేషేంద్రతో వస్తు మీమాంస-మళ్ళీ భావవాదంతో కలిసి ఒక కొత్త రూపు దిద్దుకొంది. కవిసేన మానిఫెస్టో-దానికి ఉదాహరణం.

మరి ఈనాడు విమర్శ సిద్ధాంతాలు ఎన్ని ఉన్నాయి? పోనీ ఆంగ్లంలో ఎన్ని ఉన్నాయి? పంపత్కుమార్ ప్రతిపాదించిన అంశాలన్నీ సిద్ధాంతాలేనా? ఈ ప్రశ్నలకు సంపత్కుమారగారి గ్రంథం ప్రత్యక్షంగా సమాధానం చెప్పడంలేదు.

కాని ఆయన చేసిన ప్రతిపాదనల ద్వారా మనం మూడు రకాల దృక్పథాల్ని; సేకరించ కలుగుతున్నాం (ఈ దృక్పథాన్ని ముందే బ్రహ్మానంద 1982 చర్చించి వున్నాడు).

ఈ గ్రంథంవల్ల కల్గే సైద్ధాంతిక పరిజ్ఞానం :

సంపత్కుమారగారి ప్రకారం సాహిత్య విమర్శలో చేరదగిన అంశాలివి. వస్త్వలంకార ధ్వన్యాదులు.... (Pvi)

దీన్ని ప్రణాళికగా గ్రహిస్తే-ఆయన క్రింది సిద్ధాంతాలు చర్చించాడని చెప్పకోవచ్చు.

1. కావ్యం-వస్త్వలంకార ధ్వనులు - నిర్మాణ మార్మికత

2. కవి - ప్రతిభాదులు

3. సహృదయుడు - రసభావాదుల ప్రయోజనం.

అధ్యాయాలు ఈ సిద్ధాంతాన్ని వివరించేవిగా నిర్మింపబడివుంటే ఇంకా బావుండేది. కొందరు విమర్శకుల్ని ప్రతినిధులుగా తీసుకోవడం వల్ల వచ్చిన చిక్కు ఇది. అలాకాకుండా ఒక అంశం కింద కట్టమంచి నుంచి శేషేంద్ర దాకా - ప్రతి విషయాన్నీ చర్చిస్తే-ఈ సమస్య పరిష్కృతమయ్యేది.

ఆధునిక సాహిత్య విమర్శ-కావ్యం, కవి, సహృదయుడు-ఈ ప్రమాణాలకు లొంగుతుందా? ఈనాడు రచయిత అన్నమాట ఎంత Secularగా వాడుతున్నామో, 'విమర్శకుడు' అనడాన్నీ అలాగే వాడుతున్నాం. నవల, నాటిక, కథానిక, సినిమా, వార్తా పత్రికల్లో, వారపత్రికల్లో - చందమామలో బాలమిత్రలో అన్నిటా ప్రాకిపోయింది విమర్శ. అపుడు సంప్రదాయానుస్మృతి అంతా ఒక పరిభాషను మాత్రమే ఆధారంగా చెప్పడం - సైద్ధాంతికంగా బలం కల్గింది కాదు.

మరి సంపత్కుమారగారి పరిశోధన సాధించిందేమిటి? సంప్రదాయానుస్మృతి వస్తు-రూపాల్లో రెండిటా వుంటుంది. రచన సార్వకాలికమైన వ్యాపారం. ధ్వన్యాది ఆలంకారిక మార్గాలు ఏ ప్రక్రియకైనా వర్తించుకోవచ్చు-కాని వస్తు-రూపాలు రచనా స్వరూపాన్ని-ప్రక్రియను నియమిస్తాయి. అంచేత సాహిత్యం వెనుక ఉన్న సామాజిక గతి తర్కాన్ని పట్టుకోకుండా సంప్రదాయానుస్మృతిని గురించి వ్రాయడంలో సామంజస్యం కనిపించదు. రచనకు వస్తువుమారింది. రూపం పరిణమించింది. ఈ రెండింటా "సంప్రదాయ వ్యతిరేకత" ఎక్కడ కనిపిస్తుంది. దీన్ని ప్రాథమికంగా గుర్తించాలి. సంప్రదాయానుకూల్యత కూడా వస్తురూపాల్లో; అభ్యుదయ మార్గానికి విరుద్ధమైన ప్రతిపాదనలకు తావిస్తోందని గుర్తించక తప్పదు.

ఉదాహరణకు "సత్యనారాయణ గారిలో భారతీయ సంప్రదాయ దృక్పథం పరాకాష్ఠనందింది ' అంటే అర్థం ఏమిటి ? సాహిత్యం - జీవితం- విలువలు- వీటన్నిటిని దృష్టిలో ఉంచుకొని అన్నమాట అది. రసం - పుమర్థోపయోగి - అన్న మాటను మొదట వివరించుకొంటే - అలంకార శాస్త్రానికి వెనుకవున్న- సామాజిక దృక్పథం అవగతమవుతుంది. శాంత రస వాదాన్ని - భర్తృహరి స్ఫోటను - ఆనందాభినవుల అభివ్యక్తి మార్గాన్ని ఆవిష్కరిస్తే - జగత్తుకి సంబంధించిన ఒక అవగాహన మాత్రం లభిస్తోంది. దాని దృష్ట్యా నిర్ధారించాల్సిన విషయం - సంప్రదాయ స్యూతి - ఈ అనుస్యూతి కేవలం సాహిత్య మాత్రక మైతే అది నిష్ఫలమే - సామాజిక - తత్త్వదృష్టులలో అది మేళవించి రూపుదిద్దుకోవాలి. మార్క్సిజాన్ని విశ్వనాథ వ్యతిరేకించారు-అన్నది ఒక ప్రజాభిప్రాయం - దీనికున్న సామాజిక అస్తిత్వాన్ని గమనించకుండా - విశ్వనాథ శ్రీశ్రీలలో జీర్ణించిన సంప్రదాయ స్యూతి ఒకటేననడం కుదరదు.

ఇంతకీ "సంప్రదాయం" అంటూ ఒకటి ఉందా! అని - అది ఎప్పటికప్పుడు మారిపోయేదే కదా ! చరిత్ర దానికి తార్కాణం. అలాంటప్పుడు 'అనుస్యూతి' ఎలా ? ఇవిశేషప్రశ్నలు.

ఇండియాలో ఒకే సంప్రదాయం వుందా? ఏనాడూ లేదు. వైదిక సంస్కృతి - ఒకే రూపాన్ని కల్గిందా! అందులో సిద్ధాంతరాద్ధాంతాలు లేవా! అలంకారికులు మాత్రం అందులో ఏవో ఒక కోవకి చెందినవారు మాత్రమే కారా ! - వారి సంప్రదాయం" మాత్రం భేదాలు లేనిదా? ఇలాంటి ప్రశ్నలు వేసుకోవాలి.

అభినవులతో అలంకార శాస్త్రం పెరుగుదల ఆగిపోయింది. తర్వాత పాఠ్య గ్రంథాలు వచ్చాయి. ఎంచేత? తెలుగు సాహిత్య విమర్శ పాశ్చాత్య ప్రభావానికి లోనుకావాల్సిన చరిత్ర కావసరం-సైద్ధాంతికంగా ఎందుకేర్పడింది?

ఇవి మనం ఈనాడు బాగా ఆలోచించాల్సిన ప్రశ్నలు.

ఇన్ని ప్రశ్నలు వేసుకొంటే-వాటికి సమాధానాలు దొరికితే అపుడు సంప్రదాయానుస్యూతిని గురించి మాట్లాడటానికి వీలుంటుంది.

సంపత్కుమార గ్రంథంలో ఈ ప్రశ్నలన్నిటికీ ఏదో ఒక స్పష్టాస్పష్ట సమాధానాలున్నాయి.

1. పాశ్చాత్యం-ప్రాచ్యం అన్నవి దేశ కాలాలకి సంబంధించిన భావాలు కావు. అవి ఆలోచనా విధానాలు (చూ. బ్రహ్మానంద 1982).

2 భావం వస్తు వికల్పాలకు మూలమని గుర్తించడం ఒక పద్ధతి. భావం-వస్తువు అవిభాజ్యాలని గుర్తించడం రెండో పద్ధతి. వస్తువే భావంగా పరిణమిస్తుందని గుర్తించడం మూడో పద్ధతి. వేదాంతులు మొదటి దాన్ని; ఆలంకారికులు రెండోదాన్ని; సాంఖ్యులు మూడో దాన్ని ఆశ్రయించారు. (చూ. బ్రహ్మానంద 1981).

3. వేదాంతం-రాజకీయ తత్త్వ సిద్ధాంతంలాగానే కవిత్వానికి అంశభూతమే తప్ప - అది ఇదికాదు. సాహిత్యం హృదయ ధర్మి. తత్త్వం మేధో ధర్మి. ఈ రెంటి సమన్వయం పేరు రసదృష్టి. రసమంటే 'intellectual realisation of the experience reflectad in social reality through recognition' అంతేతప్ప 'భావ' ప్రాధాన్యవాదం కాదు.

4. శ్రీ శ్రీ, విశ్వనాథులు హృదయధర్మిగా అంగీకరించిన విషయం- శిల్పం, 'రసం' మేధోధర్మి కూడ కల్గింది కాబట్టి - దాని నిరూపణలోనే భిన్న మార్గాలు తొక్కారు. అది విశ్వావగాహనకు సంబంధించిన మూల సూత్రాలలోని భేదం. దానికి వీళ్ళిద్దరూ అభివ్యక్తులే తప్ప-వీళ్ళు మొదలు పెట్టింది కాదు. అంచేత విశ్వనాథ సాహిత్య దృష్టికి-'రసం'-తాత్త్వికానందం; లౌకికాలౌకిక విషయ - సమన్వయం ప్రమాణం 'ధర్మం'- అదిబుద్ధికీ హృదయానికీ రెంటికీ తెలిసేది శ్రీ శ్రీ-సాహిత్య దృష్టికి 'రసం'- చైతన్యాన్ని అందించే క్రియాశీలసాధనం, జీవిత సూత్రం-లౌకిక జీవితాన్ని వ్యవస్థీకరించడం - ప్రమాణం 'Commonsense' ఇక్కడ బుద్ధి - హృదయం అన్న విభాగంలేదు.

అంచేత సంప్రదాయ స్యూతి-అంటే మనిషిలో అతీంద్రియశక్తి ఉనికిని గుర్తించే ధర్మ మన్నమాట. మనలో చాలామంది కవులుగా అంగీకరిస్తూ-విమర్శకులు కాదంటున్న అంశం. ఆధునిక మానవాళిని

నిరంతరం వేధిస్తున్న అంశం. సమాధానం తెలిసే చెప్పలేని అంశం. సంపత్కుమార చేత ఈ వ్యాసం రాయించిన అంశం. యంత్రం కన్నా మానవుడిలో అదనంగా వున్న అంశం.

ఇలా వారు వివేచించింది 'సాహిత్య సంప్రదాయాను స్యూతిని' దానికి దేశకాలాది అవధుల్లేవు. అందుకే ఆయన ఆలంకారిక పరిభాషకున్న లోతుల్ని తవ్వ గల్గారు. ఇదీ ఈ గ్రంథం ప్రయోజనం.

పాశ్చాత్య ప్రభావం-సంప్రదాయపునర్వికాసం

అనుస్యూతి 'జీవలక్షణానికి' చెందింది కాగా, పునర్వికాసం- పరప్రభావంవల్ల వచ్చేది. 'వ్యుత్పత్తి' అభ్యాసం' ప్రతిభతో పాటుగా అనివార్య కావ్యహేతువులు కావడం ఇందువల్లే. ఈ సమీక్షకుడి దృష్టిలో భారతీయ సంప్రదాయ స్వభావం-సమగ్రంగా అవగాహనకు రావడానికి సంస్కృత గ్రంథాల కంటె ఎక్కువగా సహాయ పడ్డవి ఆంగ్ల గ్రంథాలు. 20వ శతాబ్దంలో తెలుగు సారస్వతం ప్రపంచ సారస్వతం దశకు చేరుకొంది అనేక గ్రంథాలు తెలుగువారి పరిచయంలోకి వచ్చాయి. సంపత్కుమార శాస్త్రపరతగా 13వ అధ్యాయంలో చర్చించిన విషయమంతా ఈ దృష్టిలో పరిశీలించదగింది. మన స్తత్వం, పురావిజ్ఞానం, నృశాస్త్రం, జానపద సాహిత్యం, భాషా శాస్త్రంలో నూత్న సిద్ధాంతాలు. ప్లాటో-అరిస్టాటిల్ ల మీది నవ్య వ్యాఖ్యానాలు, ఇవన్నీ తెలుగువారిని సంప్రదాయాన్ని సమగ్రంగా వ్యాఖ్యానించడానికి సహకరిస్తున్నాయి.(ఈదృష్టితో ఇలియట్ సంప్రదాయం మీద రాసిన వ్యాసం అనివార్యంగా చూడాల్సి వుంది.)

ఈనాడు పురాణ ప్రతీకల్ని గురించి ప్రాగ్రూప దృష్ట్యా; అభివ్యక్తిని గురించి లెనిన్ ప్రతిఫలనవాద దృష్ట్యా, మార్క్సును గురించి మనువు - దృష్ట్యా చర్చించాల్సిన విశ్వజనీన అవసరాలు ఏర్పడుతున్నాయి. కొత్తపాతల భేదాలు లేవు సాహిత్యానికి-అన్నది మన అవగాహన ఈనాడు.

అంచేత విమర్శనరంగం - విశ్వవిద్యాలయాల్లో-బయట - అన్ని రంగాల్లో వృత్తుల్లో ఉన్నవాళ్ళు నిర్వహిస్తున్న అనుభవిస్తున్న సామూహిక వ్యాపారంగా గుర్తించాల్సిన అవసరం ఉంది. సర్దేశాయి తిరుమల రావు గారి రచనలు - ఈ ధోరణిని ప్రతిబింబిస్తుంటాయి. అక్కడా సంప్రదాయాను స్యూతి వుంది. అది సాహిత్య సిద్ధాంతానికి సంబంధించినది. కాని ఆయనలో కొట్టవచ్చినట్టు కనిపించేది పాశ్చాత్య సంపర్కం. అది వుండటం వల్ల సంప్రదాయానుస్యూతికి భంగం లేదనడమే గుర్తించాల్సిన విషయం - సంపత్కుమార ఈ అంశాన్ని చర్చించడంలో కూడా సఫలీకృతులయ్యారు.

ఇలా ఈ గ్రంథం నూత్నమార్గ ప్రబోధకంగా వుంది.

పాఠకుడికి మనవి :

తెలుగులో విమర్శను గురించిన 'metacriticism' దాదాపు మొదటిసారిగా సంపత్కుమారగారు మొదలుపెట్టారని చెప్పాలి—"శిల్ప సమీక్ష"; వంటి పూర్వ గ్రంథాలు - ఈ అవగాహనకు కొంత తోడ్పడినా - ఈ గ్రంథ పరిధి లేదు. మొదటిసారి చదివి అర్థం కాలేదనుకొని పక్కకు నెట్టడం తెలుగువాడి అలవాటు. సీరియస్ రచనలు చదివే అలవాటు పండితుల్లో కూడా చాలావరకు అంతరించిపోతున్న దశలో ఇలాంటి గ్రంథం రావడం - మన సాహిత్యం ఒక ఉత్తమ సంప్రదాయాన్ని నెలకొల్పు కొంటుందనటానికి ఆశాకిరణంగా వుంది. రచయిత బహుశ్రమకోర్చి గ్రంథాల్ని చదివి - విమర్శించి - డా॥ రామకోటి శాస్త్రిగారి వంటి విమర్శక పండితుడి ఖండన మండనల కోర్చి-బయటపడవేసిన గ్రంథం ఇది. అందుచేత దాన్ని చదవాల్సిన పద్ధతి ఒకటి వుంది. అది అథస్సూచికల్ని ఎప్పటి కప్పుడు తిరగ వేసుకొంటూ, చదవని గ్రంథాల్ని తెప్పించి నింపాదిగా చదువుతూ సాఫీగా నోట్సు రాసుకొని అర్థం చేసుకోవాల్సిన గ్రంథం. సిద్ధాంత వ్యాసం అంటే అలాగే వుండాలి మరి.

ఈ విమర్శకు రచయితా, చదువరి సహృదయంతో స్పందిస్తారన్న నమ్మకం సమీక్షా కర్తకుంది. సమీక్ష Abraahms చెప్పినట్టు అద్దంలాగా, దీపంలాగా రెండు రకాలుగానూ పని చెయ్యాలి-అందుకే ఇంతగా రాయడం.

'తస్మాత్ సతామత్ర న దూషితాని
మతాని తాన్యేవతు శోధితాని
పూర్వ ప్రతిష్ఠాపిత యోజనాసు
మూల ప్రతిష్ఠా ఫలమామనంతి' —అభినవభారతి.

# సాహిత్యగోష్ఠి

## నేటి హిందీ వ్యంగ్యకారులు

నేటి హిందీ వ్యంగ్యకారులలో హరిశంకర్ పరసాయీ, శ్రీ లాల్ శుక్ల, ప్రభాకర్ మాచవే, నరేంద్ర కోహలీ, కె పి. సక్సేనా, లక్ష్మీకాంత్ వైష్ణవ, బరసాన్ లాల్ చతుర్వేదీ, అజాత శత్రు కృష్ణచందర్ చౌదరి "కిట్టు" మున్నగు ప్రభుతులు చెప్పతగిన వారు; వీరు, వ్యంగాన్ని స్వతంత్ర ప్రక్రియగా తీర్చిదిద్దడానికి బాగా ప్రయత్నం చేస్తున్నారు. వ్యంగ్యపరమైన కథలు వ్యాసాలు, విమర్శలు హిందీలో సంకలన రూపంలో(తెలుగులో కంటె) బాగా వెలువడుతున్నాయి. హిందీ పత్రికలు కూడా ఈ ప్రక్రియను బాగా ప్రోత్సహించి, పోషిస్తున్నాయనే చెప్పాలి. కొన్ని పత్రికలైతే ప్రతి సంచిక లోనూ ఎవరిదో ఒకరిది వ్యంగ్య రచనను ప్రచరిస్తూ ఈ ప్రక్రియకు విశిష్టతను, గౌరవాన్ని చేకూరుస్తున్నాయి

మరొక ముఖ్యమైనవిశేషమూ, విశిష్టత ఏమంటే వ్యంగ్యప్రక్రియను గురించి కూలంకషంగా అధ్యయనం చేసిబాగా సమీక్షిం చేవారూ ఉన్నారు. ఈ సమీక్షకులు వ్యంగ్య రచనల యొక్క స్వరూపం. లక్ష్యా, శైలి, ప్రయోజనం గురించి ఎవరి మట్టుకీ వారే తమ తమ నిర్దిష్టమైన అభిప్రాయాన్ని, దృక్పథాన్ని, కొలమానాన్ని కలిగి ఉన్నారు కూడా.

"వ్యంగ్యాన్ని, కథ, నవలలుగానే స్వతంత్రమైన ప్రక్రియ అని, సాంఘిక. రాజకీయ రంగాలలో ఉన్న కుళ్ళును ప్రక్షాళనం చేయడానికి బాగా పనికి వచ్చే ఆయుధం" అని రత్నాకర్ పాండే నమ్ముతారు. వ్యంగ్యానికి హాస్యం తోడైతే మరి మంచిదంటారు.

సరోజనీ ప్రీతమ్ వ్యంగ్యరచన సమ్మెట లాంటి ఆయుధ మంటారు "ఇది సాహిత్యానికి ప్రాణం లాంటిది. దీని వ్రేళ్ళు చాలాలోతుగా పాకిఉన్నాయి దీన్ని యింకా బాగా గౌరవించి, ఆదరించడం చాలా అవసరమంటారు, ప్రీతమ్.

ఇంగ్లీషు సాహిత్యంలో హ్యూమర్, సెటాయర్ విట్, అయిరనీ, సర్ కాసిజమ్; మొదలైన పేర్లు వేరు అభిప్రాయాలు, లక్ష్యంతో వాడుక లోకి వచ్చినట్లు మన భారతీయ సాహిత్యంలో కూడా వస్తే బాగుంటుందంటారు లక్ష్మీకాంత్ వైష్ణవ్.

మరి కొంత మంది దృష్టిలో వ్యంగ్య రచనల ప్రాచుర్యం ఆయా భాషలకు సంబంధించిన సాహిత్యం యొక్క పెంపు, స్థాయి, వాసిని అంచనా వేయడానికి పనికి వచ్చే కొల బద్ద

నిజానికి వ్యంగ్య రచన పాఠకుణ్ణి బాగా ఆకట్టుకొని, అతనితో ఆత్మీయతను పెంచుకోవడంలో కథ, నవల, నాటకం కంటే చాలా ముందుంటుంది.

హిందీలో 19వ శతాబ్దంలో గద్య సాహిత్యం ఆరంభమైనప్పటి నుండి వ్యంగ్యం చోటు చేసుకొంది. ఎప్పుడైన సంఘం, రాజకీయరంగం, ధార్మిక అచార వ్యవహారాలలో చిత్తశుద్ధి, ఆచరణ లోపించిన కారణంగా మొలకెత్తే గాబును తవ్వడానికి ఈవ్యంగ్యం పదునైన బొరిగలా పనికొస్తుంది అంతేకాకుండా మూఢ నమ్మకాలు, సంఘాన్ని మోసగించే మేకవన్నె పులిజాతికి చెందిన పెద్ద మనుషులు, శబ్దాడంబరం ఉట్టిపడే వారి ఉపన్యాసాలూ, సాంప్రదాయం, స్టేటస్ పేరుతో పోషించబడుతున్న ఆడంబరాలు ఈ రచనా ప్రక్రియకు వచ్చి ఎరువులా పని చేస్తాయి కూడా.

ఇరవయ్యోశతాబ్ధం చివరి దశాబ్దంలో జీవిస్తున్న మనం మన సభ్యత, సౌఖ్యం, కార్లు, కట్టడాలు,

ఫానులు, విమానాలు గురించి గర్విస్తు ఉంటాం; మన బహు భాషా పాండిత్యం, మన పుస్తకాలు గురించి మీసాలు మెలివేస్తాం కాని ఇరుగు పొరుగు వారి భాషను అర్థం చేసుకోలేక పోతున్నామని; నాగరికత అన్న కవిత లో సురేష్ ఇలా వ్యంగ్యంచేస్తారు.

మనం ఆదిమానవులుగా,
గుహాలలో ఉన్నప్పుడే నయం;
పశుల, జంతువుల భాషని
అర్థం చేసుకొనే వాళ్ళం!
ఈ నాడు నియోన్ లైటులో
 కూర్చొంటాం;
విమానంలో ఎగురుతాం,
అయితే ఏమి లాభం ?
మనిషిగా మనిషి
భాషనే అర్థం చేసుకోలేక
పోతున్నాం

అలానే రాజకీయ నాయకుడి సామాన్యజ్ఞానం గురించి కవిత రచిస్తు –''ఒక మంత్రిగారు ఏటమిక్ ప్లాంట్' గురించి ప్రారంభోపన్యాసం చేస్తూ – ఈ ప్లాంటు చాలా విటమిన్లను కాస్తుంది. ఇంక వీటిని బాగా తిని, ఆరోగ్యం పెంపొందించు కోవచ్చు మనం'' అంటారని వ్యంగ్యం చేస్తారు 'జ్ఞానవీర్' అన్న కవితలో

రామాయణంలో హనుమంతుణ్ణి మింగిన రాక్షసి 'సురసాను' వర్ణించి దాని చెల్లెలే 'సురసీ' అని ఆ 'సురసీ' యే కలి కాలంలో 'కురసీ' (కుర్చీఅంటే పదవి) గా అవతరించి మన ప్రాణాలను తీస్తుందని అశోక చక్రవర్తి ''సురసీ'' అన్న కవితలో పదవీ వ్యామోహ ప్రబుద్ధుల్ని వ్యంగ్యబద్ధం చేస్తారు.

గాంధీగారిక్కి. వారి అహింసా సిద్ధాంతానికి మన దేశంలో పట్టిన దుర్గతిని ఇలా వ్యంగీకరిస్తారు. సర్వేశర్ ––

''ఇంటి పెరటి లోని
గాంధీగారి మేక ఒకటే గోల పాపం
ఇంతలో మరోకవైపుకు తుపాకి పేలింది పాపం'
ఈ వంకులలో గాంధీగారి మేక అహింసకు తుపాకి నాయకులఅబద్ధాలకు ప్రతీకం చేయబడ్డాయి.

వ్యంగ్య కారుడు సాధారణంగా సంఘం లోని నిస్సహాయ నిరుపేద వర్గాన్కి వకీలుగా కలం సంధిస్తాడు. అందుగురించి వ్యంగ్య రచన యొక్క స్వరం అందరికి సమానంగా వినిపించదు.

ముఖ్యంగా నేటి హిందీ వ్యంగ్యంకారులు ఈ నాటి భారతదేశంలో చేదోడు వాదోడుగా కనిపించే దరిద్రం–విలాసం, చిన్నపాకలు– పెద్దమేడలు, ఆకలి అజీర్తి, కాలిబాట – కారు, మొదలైన వైరుధ్యాల యెడ తమ కోపాన్ని, అసహ్యాన్ని, విద్రోహాన్ని వ్యక్తీకరిస్తున్నారు. ధర్మవీర భారతి రచించిన ''మునాదీ'' (దండోరా)రామధర్మ మిశ్రాగారి''చిడియా ఘర్ (జంతుశాల) రఘువీర్ సహాయ్ సుప్రచంపిన మనుషులు' మొదలైన రచనలు ఈ నాటి వాస్తవాన్ని మానవ జాతి అనుభవిస్తున్న నానా రకాలైన యాతనల్ని పాటకుల ముందు ప్రత్యక్షం చేస్తాయి అందుకని సాంప్రదాయ బద్ధులైన సాహితీ వేత్తలు కూడా వ్యంగ్య ప్రక్రియను గౌరవించకుండా ఉండలేక పోతున్నారు ఈ పరిస్థితినే హరిశంకర్ పరసాయీ–హిందీ వ్యంగ్య రచనల గౌరవం సాహితీ రంగంలో బాగానే పెరిగింది, ఇప్పుడు ప్రక్రియ శూద్రుడుగా కాక బ్రాహ్మణుడుగా చలామణి అవుతుంది అని స్పష్టం చేస్తారు.

అయితే కాకలు తీరిన వ్యంగ్యరచయిత కె. పి. సక్సేనాగారు 'వ్యంగ్యం' అన్ని ప్రక్రియలలోనూ అంతర్గతంగా చలామణి అవుతుంది కాబట్టి దీన్ని ప్రత్యేకమైన ప్రక్రియగా సిద్ధాంతీకరించడం అన్యాయం అంటారు వారిదృష్టిలో వ్యంగ్యం నిజానికి ఒక రకమైన "మదర్ టించర్" లాంటిది ఈ నేటి పరిస్థితులలో దీని అవసరం, చాలా ఎక్కువగా ఉందనడం నిర్వివాదం. ఎందుకంటే భారతదేశంలో అన్నిరంగాల లోనూ సమస్యలు అలా చిగురుస్తునే ఉన్నాయి. విలువలు విపరీతంగా తారుమారవుతున్నాయి. విజ్ఞానం ధర్మమా అని పత్రికలూ, కరపత్రాలు, కెమేరాలు, మైకులు, సన్మానవేదికలు, ప్రతిభ. సాధన, సత్ప్రవర్తనకి దేవి డిమన్నా చెప్పి పైసాకి, కుర్చీకి, స్వాగతాంజలి పలుకుతున్నాయి. ఈ ఉల్టా విలువుల యొక్క

మహిమకు మరి పోగొట్టుకుంటున్న వారు వీటి గురించి ఎంతనీచానికైనా సంసిద్ధులై పోతున్నారు, దీని పరిణామమే లంచం, మామూళ్లు, జన్మదినోత్సవ కానుకలు వగైరా వగైరా. రత్నప్రకాశ్ శీల్ ఈ పరిస్థితినే 'లంచం మహిమ' అన్న హెడ్డింగుతో పెద్ద వ్యంగ్య వ్యాసాన్ని వ్రాసారు.

హిందీలో ఈ లంచం గురించిన ఎన్ని సామెతలు ఉన్నాయో చూడండి, వంచదార కొలది తీపి, ఈ చేత్తో ఇస్తూ ఆచేత్తో పుచ్చుకో మరి; నీది దాచుకో పరాయి సొత్తుతో పబ్బం గడుపుకో ఈ సామెతలు లంచం మహిమను ఎంత చక్కగా స్ఫురింప చేస్తున్నాయి. అర్థం కాకపోతే నీ ఖర్మ, పూర్వం రాజులకు నవాబుకు నజరానా యియ్య లేదా?

ఇంగ్లీషువాళ్ళకు ప్రజంటేషన్లు సమర్పించుకో లేదా? ఈనాడు హోటలుకు పోండి సర్వర్ ముందు మీముఖం చూస్తాడు. తరువాత జేబుమీద కన్నువేసి ఎంత 'టిప్' ఇవ్వగలరో అంచనా వేసుకొని ఆ అను పాతంలో మీ యెడ మర్యాద, మీపాత్రల్లో సాంబారు ఒలకబోస్తాడు చెట్నీవర్ధన్నా వడ్డిస్తాడు. ......మరి లంచం అంటే ఏం అనుకున్నారు.

ఇక దంత వైద్యుడి వద్దకు ఒక రోగి వెడతాడు. పన్ను ఊడదీయాలంటే పన్నుచెల్లించాలని డాక్టరు షరతు పెట్టేసరికి రోగి లోలోన ఇలా తిట్టుకుంటాడు.— ''పళ్ళకు కుటుంబని యంత్రణని ప్రభుత్వం అమలు చేస్తే ఎంత బాగుండును; ఆ పళ్ళు పదహారు ఉండబట్టి ఊడబీకించే సమస్య ఎదురయింది; కన్ను, చెవి, ముక్కులో బాధవస్తే ఊడబీకేస్తానంటాడా డాక్టరు మాత్రం ఎందుకని? అవి ఒకటలేదా రెండు సంఖ్యలోనే ఉన్నాయి కాబట్టి ఇలా డాక్టర్ల క్రూరత్వాన్ని వ్యంగీకృతం చేస్తారు సరోజనీ ప్రీతమ్ 'పూల చందుని పంటినొప్పి' అన్న కథలో.

జన సంఖ్య సమస్యని, మనలో ఉన్న మూఢ నమ్మకాలను ముడి పెట్టి మంచి హాస్యాన్ని వ్యంగ్యాన్ని అందిస్తారు. రవీంద్రనాథ త్యాగి 'పాతఅప్పు' అన్న వ్యాసంలో. పుత్రుడు పుట్టకపోతే పున్నామ నరకం తప్పదని ఒక మూఢనమ్మకం ఈనమ్మకమున్న వాళ్ళు కొడుకు గురించి పడిన పాట్లను వర్ణిస్తూ ప్రభుత్వానికి రచయిత సలహా ఇస్తారు. 'కొడుకు లేకపోయినా ఫర్వాలేదు; ప్రభుత్వమే బాధ్యత' వహిస్తుంది అని ప్రకటన చేస్తే కొంత జనసంఖ్య తగ్గేదే కదా – అని హేళన పట్టిస్తారు త్యాగి. ఈ వ్యంగ్యకారులకు 'తన, పర' అన్న భేదభావం ఉండదు కనిపించిన ప్రతీవారిని సబ్జక్టుగా చేసి హాస్యరసాన్ని సృష్టిస్తారు తన జాతికి చెందిన కవుల్నీ, విమర్శకుల్నీ– సన్మానాలకు, డాక్టరేటు లాంటి బిరుదులకు ఎగబడే వారిని విడిచి పెట్టరు. ఈవ్యంగ్యకారులు.

డా. పి. ఏ. రాజు

# మెరుపుల మరకలు – ఒక సమీక్ష

1656వ సంవత్సరంలో ఆంధ్రదేశం అవతరించిన తర్వాత తెలుగు సాహిత్య రంగంలో యూరపు దేశాల నాగరికత ప్రభావం వల్లగాని, ఫ్రాయడ్, యుంగ్, హెదలక్, ఎల్లిస్‌ల వంటి మనోవైజ్ఞానికుల ప్రభావంవల్లగానివిభిన్నసాహిత్యసిద్ధాంతాలుసాహిత్యాభిరుచులుఏర్పడ్డాయి ఒక వైపుసనాతనధర్మాన్ని,సాంప్రదాయాలను,అభివృద్ధిపరచాలని సనాతనవాదులు, మరో వైపుఆధునిక విజ్ఞాన శాస్త్ర పరిస్థితులకు అనుగుణంగా మానవ జీవితంలోమార్పుతేవాలని అభ్యుదయ వాదులు కంకణం కట్టుకున్నారు. అదే కాలంలోజీవితం పట్లగాని సాహిత్యంయొక్క లక్ష్యం పట్లగాని, సరియైన అవగాహనలేక సంఘర్షణకులోనై స్వేచ్ఛా ప్రియత్వం, విశృంఖలత్వం మొదలయిన విషయాలకు ప్రాధాన్యత నిస్తే మరికొందరు సమస్యా పూరితమైన మానవ జీవితాన్ని నిశిత పరిశీలనలో ఆకళింపు చేసుకునే ప్రయత్నం చేశారు: అటువంటి వారిలో ప్రముఖులుగా పేర్కొనదగిన వ్యక్తి శ్రీ గోపీచంద్.

గోపీచంద్ జీవిత చరిత్ర గురించి రాస్తు (శ్రీ) త్రిపురనేని సుబ్బారావుగారు అంటారు—"గోపీచంద్ గారు మొదట భౌతిక వాదిగా జీవితం ప్రారంభించినారు. అంతటితో ఆగిపోలేదు. కథకులుగా జీవితం ప్రారంభించి తత్వవేత్తగా పరిణతి పొందారు. క్రమానుగతంగా పరిణతిచెంది భగవంతుని మీద పరిపూర్ణమయిన విశ్వాసంతో జీవించారు. అరవిందుని దర్శనం, తత్వగ్రంథ పఠనం, జీవితం నేర్పిన పాఠాలు గోపీచంద్ గారిని ఆధ్యాత్మిక వాదిగా మార్చివేశాయి. సూక్ష్మదృష్టితో చూస్తే అస్తిక నాస్తిక వాదాల ఘర్షణే వారి జీవిత సారముగా గోచరిస్తుంది. ("మహారచయిత తత్వవేత్త (శ్రీ) గోపీచంద్ జీవిత చరిత్ర, పే. 42) అరవిందుని దర్శనం ప్రభావంవల్ల ఆయన ఆత్మోన్నతిని పొందడమే జీవిత లక్ష్యమని, ఈ లక్ష్యాన్ని సాధించడంలో మానవ సమాజానికి ముఖ్యస్థానం వున్నా అసలయిన విలువ వ్యక్తి స్వాతంత్ర్యానికి, వ్యక్తిత్వానికి యివ్వవలసిఉంటుందనిఅంటారు. భౌతికవాదిగాజీవితాన్ని సంపూర్ణంగా అనుభవించి అందుమూలంగా నేర్చిన విషయాలూ, తెలిసికొన్న సత్యాలూ ఆయనను ఆధ్యాత్మిక వాదిగా మార్చివేశాయి. ఈ ఆధ్యాత్మికత మానవుని ఆత్మ స్వాతంత్ర్యానికి ప్రాముఖ్యతనిస్తుంది. అనవసరమైన దుర్భ్రమలకులోనుగాకుండా సత్యాన్ని అన్వేషించడం, దానికి అనుగుణంగా తనలోనూ, ఈ సృష్టిలోనూ నిండివున్న మహత్తర సత్యాన్ని తెలుసుకొని, అనుభవగతమయిన విషయంగా మార్చుకుని, అందులోనే లీనమయేందుకు చేసే ప్రయత్నమే అధ్యాత్మికత.

("Spirituality respects freedom of the human soul, because it is itself fulfilled by freedom; and the deepest meaning of freedom is the power to expand and grow towords perfection by the law of one's own nature Dharma"— అరవింద దర్శనము) - కాకుమాను తారానాథ్.

మరొక సందర్భంలో అరవిందులు ప్రపంచం బ్రహ్మస్వరూపమని — అది కానిది యింకొకటి లేదని అంటారు. జడపదార్థంగా భావించబడే ప్రతిదానితోను ఒక మహత్తర చైతన్యస్వరూపం వుంటుంది దానినుంచి ఉద్భవించే జీవం నుండే మనసు, ఆ మనసులోని చైతన్యానికి ఆత్మ పరిశోధనకు, ఆత్మ విస్తృతికి అనువయిన శక్తి వుంటుంది (Matter, in which conscionsness is least potent, developed into life which manifests consciousness is a concrete manner and life delevered out of itself mind in which consciousness has attained a definit stage of self awareness and self duection "-- Light from Sri Aurodindo", Sri M. P. Pandit) అయితే ఈ "self- awarness" కంటె, self direction కంటే మించిన చైతన్య స్థితి ఒకటి వుందని (super mind) — అది సచ్చిదానంద స్వరూపాన్ని పొందడమని ఆయన ఉద్దేశ్యం. ఈ ఆధ్యాత్మిక దృష్టివల్ల వ్యక్తి తనలోని శక్తులను గ్రహించి, భౌతికవాదంలోని నిజాలను ఆకళింపు చేసుకుంటూ, అహంకారంనుండి విముక్తిపొంది దైవత్వాన్ని పొందుతాడు. మరొరకంగా చెప్పాలంటే అనుభూతి రహితమైన, మానసిక స్వేచ్ఛలేని, నిజాయితీతో సంబంధం లేని యాంత్రిక జీవితంలోని పరిస్థితులతో నిత్యం పోరాడుతూ మానవజీవితాన్ని పూర్తిగా అనుభవించిన వ్యక్తే ఋషి కాగలడని, అటువంటి వ్యక్తే సమాజ శ్రేయస్సుకు పాటుపడగలడని, మార్పుతేగలడని అన్న అరవిందుల సిద్ధాంతాన్ని పూర్తిగా ఆత్మగతం చేసుకున్న వ్యక్తి గోపీచంద్. (The spiritual man who can guide human life towards its perfection is typified in the ancient Indian idea of Rishi, one who has lived fully the life of man and found the word of the super - intellectual, supra - mental, spiritual truth. He has risen above these lower limitations and can view all things from

above, but also he is in sympathy with their effort and can view them from within; he has the complete inner knowledge and the higher surpasing knowledge therefore he can guide the world humanly as God guides it bivinely because like the Divine he is in the life of the world and yet above it," — 'అరవింద దర్శనము కాకుమాను తారానాథ్.)

గోపీచంద్‌గారి మానస సాగర మథనంవలన ఉద్భవించిన అమూల్య నవలా రత్నమే 'మెరుపుల మరకలు' ప్రబంధ కావ్యాల నన్నిటిని క్షుణ్ణంగా చదివిన వ్యక్తి కావడంవల్ల ఈ నవలలోని శృంగార ఘట్టాల్లో అదే శైలిని అనుకరించారు -- తత్ఫలితంగా శృంగారరస ప్రధానమైన నవలగా అనిపిస్తుంది గాని తెరిచి చూస్తే హీగెల్, కార్లమార్క్సుల ద్వంద్వాత్మిక భౌతిక వాద ప్రభావం స్పష్టమవుతుంది. ద్వంద్వాత్మక ప్రవృత్తి వికాసానికి గుర్తు మానసికంగానే కాకుండా బాహ్యపరిస్థితులలోనూ నిత్యం జరిగే సంఘర్షణ ఫలితంగా వుద్భాసితమయ్యే మరోసత్యం. దానివల్ల ఆ వ్యక్తిలో మార్పు తప్పదు. అటువంటి వ్యక్తి కథే 'మెరుపుల మరకలు' ఇందులోని ఇతివృత్తం గురించి వ్రాస్తూ త్రిపురనేని సుబ్బారావుగారు నాయిక ఉషారాణి జీవితం గురించి అంతిమ పరిణతి గురించి అంటారు. "జేగీయమానమైన మెరుపుగా ప్రభావించి, మరకలను విసర్జించి, వెన్నెలను స్వీకరించి హిమశైలానికీ అంకితమైన సుదరి సుందర జీవితం, అని అత్యున్నతికి అవసరమైన ఆధ్యాత్మిక దృక్పథం గోపీచంద్‌గారు ఉషారాణి పాత్ర ద్వారా వ్యక్తీకరించి, భౌతిక వాదిగా రచయితగా జీవితంపట్ల అభిప్రాయాలను కమలాకర్ పాత్రద్వారా స్పష్టం చేశారు. గోపీచంద్‌లోని హేతువాద దృక్పథ-ఉషారాణి పాత్రలోనూ స్పష్టం అవుతుంది. సామాజిక స్పృహ కలిగిన రచయితకి కావలసిన ఆత్మస్థైర్యం నిజాయితీ ఆయన పాత్రలలో ప్రతిబింబిస్తుంది. జీవన వికాసానికి వ్యక్తి తానుచేసే ప్రతిపనిని, తనకుకలిగే ప్రతిభావాన్ని ఎదురయ్యే ప్రతి అనుభవాన్ని ప్రశ్నిస్తూ, అందులోని నిజానిజాలను గ్రహించగలగాలి. (జిడ్డు కృష్ణమూర్తి) ఆటువంటి వ్యక్తేతనలక్ష్యాన్ని సాధించగలుగుతాడు. ఉషారాణి చేసేది కూడా అదే ఆమె చెప్పే ప్రతి మాట మనలను తిరిగి అందులోని నిజానిజాలను తెలుసుకునేందుకు ఆలోచించేదిగా చేస్తుంది. స్త్రీ పురుషులు ఎవరయినా ఒకే వ్యక్తిని ప్రేమించగలరని ఎవరయినా అంటే ఆమెకునచ్చదు. ఆమె ప్రకారం ఒక తుఫానుకు లోనవడంతప్పయితే ఎన్ని తుఫానులకు లోనయినా అదే తప్పు తుఫానుల సంఖ్యనుబట్టి తప్పుపెరగదు. మొదటి తుఫానుకు లోనవడం తప్పుకాకపోతే ఎన్ని తుఫానులకు లోనయినా తప్పుకాదు. (మెరుపుల మరకలు; పే 76). ఈ తత్వమే ఆమెను నిలకడలేనిదిగా. చంచల మనస్కురాలిగా చేస్తుంది. రామానుజంతో వివాహమైనా అతనిలో తృప్తి పొందలేక చక్రవర్తితోను, శ్రీకాంతతోను సంబంధాలు పెట్టుకుంటుంది. అయినా ఆ మనసుకు తృప్తిలేదు, మరి దేనినో పొందాలన్న తపనతో నిరంతర అన్వేషణ సాగిస్తుంది. ఆమెలోని ఈ ఆరాటాన్ని స్పష్టంగా చెప్పాలంటే గోపీచంద్‌గారి మాటల్లోనే చెప్పటం ఉచితం. "భర్తమీద ఉషారాణికి యింతవరకెప్పుడూ అయిష్టత కలిగివుండలేదు. అయినా పరపురుషులమీద చూపుపోకుండా వుండటంలేదు అటువంటి పుడు తన చూపు చలించడానికి తన భర్త కారణమని ఎలా అనుకోగలదు? పైగా అలా చలించిన చూపైనా ఏ ఒక్కరిమీదో నిలబడి వుండటం లేదుగదా। తన ప్రభావం లోకి వచ్చిన ఏ ఒక్కరినీ విడిచి పెట్టి ఊరుకో బుద్ధి కూడా అవటము లేదు. అందువల్ల తన పుటకలో యేదైనా ప్రత్యేకత వుందేమోనని అనుమానం ఎల్లప్పుడూ ఆమెను అంటిపెట్టుకునే వుంటుంది, ఒకవేళ అటువంటి ప్రత్యేకత వుంటే తాను చేయగల్గింది ఏముంది? తన బుద్ధికి తోచిన విధంగా పోవటం కంటె గత్యంతరం లేదనుకుంది. అయితే ఈజీవితం ఎలా అంతమొందుతుందో అన్న ఆలోచన ఆమెకు అప్పుడప్పుడు రాక పోలేదు. ఎలాఅంతమొందితే మటుకు వచ్చే నష్టమేమొచ్చె అనుకుంది. ఏ మాత్రం కంగారు పడేది కాదు. భయపడేదికాదు. సంప్రదాయ సిద్ధంగా పోయే అందరి జీవితాలు ఒకే రకంగా అంతమొందుతున్నాయి.

గనుక తను వెదికి పోవాలా అనుకునేది. (పే. 97) ఈ సందర్భంలో ఉజ్వల భవిష్యత్ నిర్మాణానికి గతాన్ని వర్తమానాన్ని వాటిలోపాలతోను, ఊహాజనిత ఫలితాలను స్పష్టంగాచూడగలిగిన వ్యక్తేఅర్హుడనే అరవిందులు మనకు తప్పనిసరిగా గుర్తుకు వస్తారు-- "He will accept the actual realisation of the present as a stage and nothing more, keenly appreaciating its defects, self satisfied errors, presumptinos pretnentions because these are the chief enemies of progress, but not ignoring the truth and good that it has gaired; and he will sound the future to understand what the devine in it is seeking to realise, not only at the present movement, nor only in the next generation, but beyond." (Ideals and Progress).

నిజానికి తానేదో తప్పు చేస్తున్నానన్నభావం ఆమెను వదలదు. కాని కమలాకరంతో పరిచయం అయిన తర్వాత వివాహ వ్యవస్థపట్ల, స్త్రీపురుష సంబంధాల పట్ల ఫ్రాయిడ్, యుంగ్, హెవలర్ ఎల్లిలవంటి వారు చెప్పిన విషయాలను కమలాకరం ముఖతః విన్నతర్వాత అంతకు మునుపెన్నడు ఎరగనంత ప్రశాంతత అనుభవం వస్తుంది, వివాహాలు స్వర్గంలో నిర్ణయించబడినవి కావని మానవులు తమ సౌకర్యార్థం ఏర్పరుచుకున్నదేవని వారి అభిప్రాయం. ఇందులో ఏదో మహదానందం ఉంటుందని వూహించడం భ్రమ ఆనందం అనేది ఒకటి వుంటే అది వివాహాలకు బయటే వుంది. అందుకనే వివాహంలో చిక్కుకున్న జంటల్లో నూటికి ఒకరుకూడా సుఖంగా వుండటం లేదని వారి ఉద్దేశ్యం అందుకే సంఘం నియమాలను కాస్త సడలించి విడాకులను అనుమతించింది. స్త్రీపై విధించిన ఆంక్షలు, నియమాలుదీని వల్ల కాస్త సడలిరపబడ్డాయనే చెప్పాలి. పవిత్రతఅనేది స్త్రీకి మాత్రమే ఆపాదింప బడింది. ఈ పవిత్రతను అంటిపెట్టుకుని వుండని స్త్రీని సంఘంలో గౌరవం లేకుండా చేస్తున్నాం. ఈ నియమాలకి కట్టుబడి వుండడానికి అంగీకరించిన స్త్రీలకంటె ఆయన దృష్టిలో అంగీకరించని స్త్రీలే మంచివారు. ఎందుకంటే వారిలోలేని ఆత్మస్థైర్యం, నిజాయితీ వీరిలో వున్నాయి....ఉషారాణిలోనూవున్న ఈ నిజాయితీ, ఆత్మ చింతన ఆమెలోని తాత్త్వికదృష్టిని ప్రేరేపిస్తాయి. హిమాలయాల సౌందర్యంతోవుత్తేజితురాలైన ఆమెకి మరల ఇంటికివెళ్ళాలనిపించదు—వెళ్ళటం దీనికోసం? ఎవ్వరికోసం? X అసలు పిల్లలు లేకపోవడం వల్ల వచ్చిన ఆరాటమేనా? పిల్లలు కలగగానే ఈ ఆరాటం తీరిపోతుందా? ఒక వేళతీరిపోయినా అది సహజమైన పరిణామమేనా? తనకు అలా అనిపించటం లేదు. X X పిల్లలు కలగడంవల్ల నారిని పెంచే భారం మొయ్యలేక స్త్రీ జీవితంతో రాజీ పడుతుంది. ఉత్సాహం కోల్పోయి, సహజ భావాన్ని కాంతినీ కోల్పోయి, జనవస్తత్వాలు ఉడిగిపోగా ముడివగ్గయి చిన్నతనంలోని భావాల కన్నిటికీ తిలోదకాలిచ్చి కుటుంబం అనే చీకటి గంపను నెత్తిన పెట్టుకుని అలో లక్ష్మణా అంటూ జీవితం సాగిస్తూ వుండవచ్చు. ఇదే సుఖప్రదమైన, శాంతియుతమైన జీవితం అని తన్నుతాను మోసగించుకుంటూ బ్రతుకుతు వుండవచ్చు కాని ఇది సహజమైన పరిణామం అని తనెట్లు అనుకోగలదు"(పే. 198)

క్రమేపి ఆమెలోని ఈ తాత్త్విక చింతన అధ్యాత్మిక చింతనగా పరిణతి నొందుతుంది హిమాలయాలలో నివసించే స్వాములను చూసి ఆమె తనలో తానుతర్కించుకుంటుంది— " వీరందరూ భగవంతుని దర్శనంకోసం మోక్షం కోసం ప్రేరేపింప బడినవారేనా? కొంతమంది జీవితంలో వేగలేక శాంతికోరి వచ్చినవాళ్ళు కూడా ఉండవచ్చు, ఇటువంటి వారిని జీవిత పలాయనులుఅని యువకులు కొందరు ఈసడించటం తాను ఎరుగును. జీవితం రేపే కల్లోలాలను, తుఫానులను తట్టుకోలేక ఎక్కువమంది వేదాంతోన్ముఖులవుతారు. కాని అందులో తప్పేముంది! చాలామంది జీవితంతో రాజీపడి గమ్యస్థానం తెలియక పోయినా కులుకు నడకలతో ప్రయాణం సాగిస్తారు. కొంతమంది అలా చెయ్యలేక పోతున్నారు. దీనికి సంఘం ఒక బ్రహ్మరాక్షసరూపంలో

శీకరార్భాటాలతో వెంటబడి తరుముతూ వుంటుంది. ఎందుకని ? సాంఘిక సంప్రదాయాలకు, లౌకికాచారాలకు సరిపడని మన స్తత్వం వీరికి వుండటమేకదా దీనికి కారణం ? అంటే సాంఘిక నీతిని అతిక్రమించీ వున్న మరేసీతికో. భావానికో నియమానికో అది అర్థమై వుండివుండాలి. దానిని స్వీకరించడానికి ఆరాటపడుతూ వుండి వుండాలి. ప్రథమ దశలో ఈ సంగతి ఆవ్యక్తికి తెలిసి వుండకపోవచ్చు. అలా ప్రయత్నించి విఫలుడై భగవంతుని వైపు దృష్టిని ప్రసాధించవచ్చు. అంటే జీవిత భ్రమలకు లోనుకాగలందులకు. మనస్సువి సంకుచిత పరచుకోటానికి ప్రయత్నించే వ్యక్తుల జీవితమే భగవంతుని అంకంలోకి తరుముతూ వున్నదన్నమాట. భగవంతుని స్పృహ ఈ విధంగా కలిగిన పిదప వారు నిష్టాగరిష్టులు కావచ్చు. అందులో తప్పేముంది ?

ఆమెలో మరుగున పడిన ఈ ఆధ్యాత్మిక దృష్టే లౌకిక జీవితాన్ని సంపూర్ణంగా అనుభవించినా తృప్తి లేకపోవటం విరహగీతాలు వ్రాయడం, మధుర బృందావనాలు సుపరిచితంగా పూర్వజన్మలో తను తిరిగినవి, పుట్టిన ప్రదేశాలు కొన్ని, మెట్టిన ప్రదేశాలు కొన్నిగా అనిపించడం వీటన్నిటికి కారణం మనవైదిక వాంగ్మయంలోనే సాధకుని పత్నిగాను, ప్రభువుని పతిగాను చిత్రించటం జరిగింది. పరమాత్మతో సమాగమానికై ఆత్మలో అవగతమయే ఆవనే లౌకిక శబ్దావళిలో 'విరహం' ఆత్మ యొక్క సాధనను తీవ్రతరం చేసేందుకే ఈ విరహభావానికి ప్రాధాన్యత యివ్వబడింది. ఉషారాణిలో ముందునుంచి అగుపించేది ఈ విరహభావనే కాని సెక్స్ ప్రవర్తనలో స్త్రీలుకోరే స్వేచ్ఛ కాదు. ఆమె కోరుచున్నది అదే అయితే చంద్రవదనులని కూడా విడిచి పెట్టేది కాదు. హిమవంతుని ఒడిలోచేరి ఉషారాణి ప్రకృతిలోని అణువణువులోను ఒక మహత్తర చైతన్య స్వరూపాన్ని దర్శించగలుగుతుంది. 'సంఘం కప్పిన పొరలు ఒక్కటొక్కటె కరిగిపోతున్నట్టు అనిపించింది. మనస్సువ సంఘం వేసిన గతుకులుసర్దుకున్నట్లనిపించింది. ఎంత అహంకార పూరితునికయినా తన అణురూపం బోధపడుతుంది. అక్కడ ప్రకృతి రంగస్థలంమీద తానెంత. ప్రకృతి సౌందర్యం ముందు తనదెంత ? ప్రకృతి క్రీడలో తనే భాగం ! ఉషారాణి హృదయం ఆ ప్రకృతి రమణీయతను దర్శించగానే తన్మయంతో ఉప్పొంగింది. భరించలేని తియ్యదనంతో బ్రద్దలవుతుందేమో అనిపించింది. లోనుంచి మృదుమధుర రాగాలాపాలు వినిపించాయి లౌకిక వాసనలకు అటు పట్టయిన శరీరమే సువాసనలను వెదజల్లింది. కాంతి నిలయమయింది." ఈ రకంగా మానవమేధకు అందని ఒక మహత్తర కాంతిని, ఈ ప్రపంచంలో వున్న సత్యం కంటే భిన్నమైనది, మహత్తరమైనది అయిన సత్య రూపాన్ని దర్శించి అందులో ఐక్యం కాగలిగింది. ఆమె జీవితాన్ని సమీక్షిస్తూ చక్రవర్తి అనే మాటలోనే ఆమె జీవిత సారమంత ఇమిడి వుంది—"తనస్థాయికి సరిపడని జీవితంలో చిక్కుకుని ఆమె కల్లోల పడింది. ఇప్పుడు తనస్థాయికి సరిపడని ఆదర్శాన్ని అందుకుని జన్మను చరితార్థం చేసుకుంది."

ఈ రకంగా మానవ జీవిత చరమ పరిణతి దైవత్వాం పొందటమే నన్న ఆదర్శాన్ని మన ముందుంచారు. శ్రీ గోపీచంద్. అరవిందుని బోధనలలక్ష్యం కూడా అదే. వారిమాటలను పదేపదే మననం చసుకుంటూ ఒకనాటికి వానిని అనుష్ఠాన యోగ్యం చేయగలమనే ఆశతో, వారి వుద్బోధను యథాతథంగా యిస్తున్నాను. "To make all life religion and to govern all activities by the religious idea would seem to be the right way to the develepment of the ideal individual and ideal society and the lighting of the whole life of man into Divine."

జి. ఉషాలావణ్య
లెక్చరర్, పి. జి. కాంప్లెక్స్.
ద. భా. హి. ప్ర. సభ.
హైదరాబాద్.

* * * * *
*




# హిందీ ప్రమాణపత్ర వితరణోత్సవములు

## టి. సదుము

చిత్తూరు జిల్లా, T. సదుములో ప్రథమ ప్రమాణ పత్ర వితరణోత్సవము 15-10-82 తేది శుక్రవారం సాయంత్రము 3-30 గం॥లకు జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల ఆవరణలో వైభవముగా జరుపబడెను.

కుమారి సుధారాణి, రాధా, యశోదల ప్రార్థన గీతముతో సభ ప్రారంభించబడెను. సభకు శ్రీ T. భద్రాచారి B.Sc; B. ED ప్రధానోపాధ్యాయులు అధ్యక్షత వహించిరి. అధ్యక్షులు తమ తొలిపలుకు లలో హిందీ ప్రాముఖ్యమును గూర్చి విద్యార్థులకు వివరించిరి.

హిందీ చదువుటవలన కలుగు లాభములను గూర్చి అనేకమంది విద్యార్థులు మాట్లాడిరి. ఉపాధ్యాయులు శ్రీ A. నాగి రెడ్డి M. A; B Ed; శ్రీ S. మల్లయ్య విద్వాన్, శ్రీమతి P. అన్నపూర్ణమ్మ. శ్రీమతి K, ప్రభావతి మరియి K. సావిత్రి తమతమ అభిప్రాయములలో హిందీ చదువుటవలన కలుగు లాభములను గూర్చి వివరించిరి.

తదనంతరము ముఖ్య అతిథిగా విచ్చేసిన మైస్కూల్ కమిటి అధ్యక్షులు శ్రీ. T. సత్యనారాయణ ప్రసాద్ BSc;గారు తమ ఉపన్యాసములో విద్యార్థులను హిందీపరీక్షలకు అధిక సంఖ్యలో చేరి చదువమని ప్రోత్సాహించిరి. కొంతమంది పేదవిద్యార్థులకు పుస్తకములు, ఫీజులు చెల్లించుటకు తమ ఉదారస్వభావమును ప్రకటించిరి. ఫిబ్రవరి 1982లో ఉత్తీర్ణులైన వారికి హిందీ ప్రమాణ పత్రములు వితరణగావించిరి. బాలబాలికలకు మిఠాయిలు పంచబడెను.

అధ్యక్షుల మలిపలుకుల తదుపరి హిందీప్రచారకులు శ్రీ యరగొండ సిద్ధారెడ్డి M A; సాహిత్యరత్నగారు హిందీ ప్రాముఖ్యతను హిందీలో వివరించి వందన సమర్పణ చేయగా రాష్ట్రగీతముతో సభముగిసెను.

## పామిడి

స్థానిక ప్రభుత్వజూనియర్‌కళాశాల ప్రాంగణమందు 2-10-82న గాంధీజయంతి, హిందీపరీక్షా (ఫిబ్రవరి 82) ప్రమాణపత్ర వితరణోత్సవము జరుపబడినది.

చి. మాధవి, చి సరోజలచే ప్రార్థన గావింపబడినది. తర్వాత మహాత్మాగాంధీజీ చిత్రపటావిష్కరణ జరిగెను. హిందీ ప్రచారకులు శ్రీ ఎ. బి. ఉమాశంకర్ అతిథులకు స్వాగతము పలుకుచూ, నాటి విశిష్టతను, గాంధీజీ సిద్ధాంతములలో నొకటైన జాతీయ భాషా ప్రాముఖ్యతను వివరిస్తూ. ప్రమాణ పత్ర వితరణోత్సవ ప్రత్యేకతను వివరించిరి.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ ఎ. ఆర్. లక్ష్మినారాయణ శర్మ స్థానిక పోస్టు మాస్టర్‌గారు గాంధీజీ

ఆశయములలో ప్రధానమైన జాతీయ భాషా ప్రచారములో ఎంతో పురోభివృద్ధి గాంచుచున్న విద్యార్థులను అభినందించిరి. గాంధీజీ ఆశయమ లను, సిద్ధాంతము లను అలవర్చుకొనవలెనని విద్యార్థులకు తెలిపిరి.

ముఖ్య అతిధులైన శ్రీ పి. రాజశేఖరశర్మ, స్థానిక అనంతగ్రామీణ బ్యాంకు మేనేజర్‌గారు గాంధీజీ జీవిత విశేషములను, బాల్యములోని కొన్ని ఘటనలను విశదపరుచుచూ, గుణగణములను ప్రశంసించుచూ, విద్యార్థులు కూడా అదే మార్గంలో నడువవలెనని హితోపదేశము చేసిరి. జాతీయ సమైక్యతకు, గాంధీజీ అనుసరించిన జాతీయ భాషా ప్రచారములో కుడా ముందంజ వేయవలెనని ప్రోత్సహించిరి.

అధ్యక్షులైన శ్రీ శర్మగారు హిందీ పరీక్షలలో విజేతలయిన విద్యార్థులకు ప్రమాణ పత్రములను బహుకరించిరి.

హిందీ ప్రచారకులు గారిచేవందన సమర్పణతర్వాత జాతీయ గీతములో సభముగిసెను.

## మొవ్వ

సాయంత్రం గం 5-00లకు శ్రీ హనుమాన్ హిందీ విద్యాలయము, మొవ్వ ప్రాంగణమునందు ఉపాధ్యాయ వృత్తిలో అనుభవజ్ఞులు, రిటైర్డు అయిన శ్రీ యద్దనపూడి శ్రీరామశాస్త్రిగారి అధ్యక్షతన సభ "వందేమాతరం" ప్రార్థనాగీతముతో ప్రారంభమైనది. యీ సభ యందు స్థానిక హైస్కూలులో పనిచేయు చున్న హిందీ పండిత్ శ్రీమతి V. జయశ్రీగారు, హిందీఅభిమాని శ్రీD శివయ్యగారు మరియు పలువురు ఉపాధ్యాయులు, తదితర గ్రామ పెద్దలు పాల్గొనిరి.

మొదటి స్థానిక హిందీ ప్రచారకులు శ్రీ K.R.K. శర్మ విద్యాలయ పురోభివృద్ధిని గురించి వివరించి, హిందీ ప్రచారమునకు హైస్కూలు ప్రధాన ఉపాధ్యాయులు శ్రీ T. రామదాసు గారు ప్రతి తరగతికి నోటీసు పంపి విద్యార్థులను ప్రోత్సహించగా, హిందీ పండితురాలు శ్రీమతి V జయశ్రీగారు మరింత ప్రోత్సాహముతో విద్యార్థులను హిందీ చదువవలసి నదిగా ప్రేరణ కలిగించి వారిని హిందీ విద్యాలయము నకు పంపుచున్నట్లుగా K.R K. శర్మగారి ఉపన్యా సము ద్వారా సభకు వెల్లడియైనది.

పిమ్మట శ్రీమతి V. జయశ్రీగారు పేర్లు చదు వగా, అధ్యక్షులు శ్రీ యద్దనపూడి శ్రీ రామశాస్త్రిగారు 1982-ఫిబ్రవరి పరీక్షలో పాసైన ద. భా. హిందీ ప్రచార సభ, మద్రాసు వారి ప్రారంభిక పరీక్షలగు ప్రాథమిక, మధ్యమ మరియు రాష్ట్ర భాష పరీక్షల విద్యార్థులకు ప్రమాణ పత్రములు పంచిపెట్టిరి. వారిని మరింత ఉత్సాహముతో హిందీ చదువవలసినదిగా తమ ఉపన్యాసము ద్వారా ప్రోత్సహించిరి. తదనం తరము తేనీటివిందు కార్యక్రమము నిర్వహించబడినది.

సభలో పాల్గొనిన వారందరికి శ్రీ K.R.K. శర్మ ధన్యవాదములు సమర్పించిరి. 'జనగణమన'- గీత ముతో సభ ముగిసినది.

## పోదిలి

తే 15-8-82దిన పోదిలి ప్రభుత్వ జూనియర్ కళాశాలలో స్వాతంత్ర్య దినోత్సవము హిందీ యోగ్యతా పత్రప్రదానోత్సవము అత్యంత వైభవో పేతముగా జరిగినది.—

ఉదయం 8 గం॥కు ప్రిన్సిపాల్ శ్రీ. T.L.A. స్వరూప్ యం. ఎ. బి. టి. గారు పతాకావిష్కరణ గావించిరి. N. C. C. క్యాడేట్ల విన్యాసమును తిల కించి వందనము స్వీకరించిరి.

తదుపరిజరిగిన సభలో హిందీ పండితులు శ్రీ ధర్మవరపు వెంకటరావుగారు స్వాతంత్ర్య సమర చరిత్రను గూర్చి సుదీర్ఘోపన్యాసము గావించి స్వాతం త్ర్యమునకై తమ సర్వస్వమును త్యాగము చేసిన త్యాగమూర్తులకు అమరవీరులకు ఘనంగా జోహార్ల ర్పించిరి బాలబాలికలచే దేశసేవాశపథముచేయించిరి.

తదుపరి ప్రిన్సిపాల్‌గారు మాట్లాడుచు హిందీ మన జాతీయ భాషయని. అది దేశ సమైక్యతకుచిహ్నమని అది మన దేశ భాష కావటంచేత దాన్ని నేర్చుకొనుట సులభమని దేశ ప్రజలలో సగానికి పైగా అది తెలిసిన భాష కావున దక్షిణాదివారంతా నేర్చుకొని జాతీయ సమైక్యతకు తోడ్పడాలని వుగ్గడించిరి.

తదుపరి 1981 ఆగష్టు హిందీపరీక్షలలో వుత్తీర్ణులైన బాలబాలికలకు హిందీయోగ్యతా పత్రముల నొసంగిరి. జాతీయ గీతాలాపనానంతరం బాలబాలికలకు మిఠాయిలు పంచబడెను.

స్థానిక డిగ్రీ కళాశాల యందు తే. 15.8.82 స్వాతంత్ర్య దినోత్సవమున దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర హైదరాబాదు వారి 1981 ఆగష్టు హిందీ పరీక్షల ప్రమాణ పత్రములు వితరణ కళాశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ బి.జె. ప్రేమసాగర్ గారిచే జరిగినది. వారు తమ ఉపన్యాసములో హిందీ మన భాషయేగాక రాష్ట్రి భాష కూడ కావున దీనిని అభ్యసించవలసిన అవసరం విద్యార్థులకు ఎంతైనా కలదన్నారు. అనంతరం అతిధులుగా విచ్చేసిన సి. వి. బ్రహ్మచారి, ఎం. కాం; జి. వి. నరసయ్య, ఎం. ఏ. గారలు హిందీ ప్రాధాన్యతను వివరించిరి. సభ జి. శైలజ ప్రార్థనా గీతంతో ప్రారంభమైనది.

హిందీ ప్రచారకులు, శ్రీ అవ్వారి వేంకట కృష్ణయ్య వందన సమర్పణ తర్వాత జాతీయగీతంతో సభ ముగిసెను.

## బుచ్చిరాజు పాలెం

తే 18.4.1982 ది సా॥ 4 గ॥లకు స్థానిక ఎన్. ఏ. డి హైస్కూలులో శ్రీ బి. యల్. యన్. శాస్త్రి బి. యస్. సి. బి. ఇడి, ప్రధానోపాధ్యాయుల అధ్యక్షతన దక్షిణ భారత హిందీ ప్రచార సభ తరఫున ఆగష్టు 1981లో ఉత్తీర్ణులైన ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రిభాష, ప్రవేశిక పరీక్షల విద్యార్థినీ విద్యార్థులకు ప్రమాణ పత్ర వితరణ జరుపబడెను. శ్రీ చందక సత్యనారాయణ సాహిత్యరత్న, పి. ఒ. యల్. ప్రవీణ ప్రచారక్, ప్రాధ్యాపకులు గవర్నమెంటు జూనియర్ కళాశాల దేవరాపల్లి మరియు శ్రీ యమ్. యల్. శర్మ ఎమ్. ఏ. (హిందీ మరియు సంస్కృతము) ప్రాధ్యాపక్, కేంద్రీయ విద్యాలయము శ్రీ విజయనగరు కాలనీ, విశాఖపట్టణం- 7గారలు భారతీయ భాషలు, వానిలో హిందీ భాష యొక్క స్థానము, హిందీని నేర్చుకొనుట యొక్క ఆవశ్యకతను గూర్చి చక్కని ఉదాహరణల నిచ్చి ఉపన్యసించిరి.

హిందీ ప్రచారకులు శ్రీ రాచకొండ లక్ష్మణమూర్తి గారు సభకు వచ్చిన సభికులను అతిధులను పరిచయము చేసి 1981-1982 వార్షిక నివేదికను చదివి వినిపించిరి. శ్రీమతి రామాయణం భారతి ప్రధాన హిందీ పండితులు మాధవధార నగరపాలక సంస్థ హైస్కూలు, విశాఖపట్నం వారిచే విద్యార్థి, విద్యార్థినులకు ప్రమాణ పత్రములను బహూకరించిరి.

నాటి సభాధ్యక్షులు హిందీ నేర్చుకొనుట యొక్క ఆవశ్యకతను తెలుపుతూ హిందీ ప్రచారకులు చేయు సేవలను కొనియాడిరి. సభకు కాలనీ ప్రముఖులు శ్రీ బి. రాజేశ్వరి హిందీ పండితులు మద్దిపాలెం రైల్వే హైస్కూలు, విశాఖపట్టణం— విచ్చేసిరి.

శ్రీ పి. వి. యస్. యస్. రమణయ్య శర్మ గారి వందన సమర్పణానంతరము జాతీయ గీతముతో సభ ముగిసినది.

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు-17

## పరీక్షా విభాగము

1983 ఫిబ్రవరి హిందీ పరీక్షలలో ఐచ్ఛిక ప్రశ్నలు :

1983 ఫిబ్రవరిలో జరుగు సభ ప్రారంభిక మరియు ఉన్నత పరీక్షలలో 1982 సెప్టెంబర్ ప్రారంభిక, ఉన్నత పరీక్షల పాఠ్య పుస్తకముల నుండి వైకల్పిక ప్రశ్నలు ఇవ్వబడును. ఈ సౌకర్యము కేవలం 1983 ఫిబ్రవరి పరీక్షలకు మాత్రమే వర్తించును.

1983 ఉన్నత పరీక్షా శుల్కము పంపు తేదీలలో మార్పు :

1983 ఫిబ్రవరి ఉన్నత పరీక్షలు దరఖాస్తులు స్వీకరించు తేదీ:

| | |
|---|---|
| విలంబశుల్కము లేకుండా | 15-12-1982 |
| విలంబశుల్కముతో | 25-12-1982 |

పరీక్షా దరఖాసు ఫారము ధరలలో మార్పులు ;

| | |
|---|---|
| ఉన్నత పరీక్షల దరఖాస్తు ఫారం 1 కి | 1—50 |
| ప్రారంభిక పరీక్షల దరఖాస్తు ఫారం 1 కి | 1—00 |
| ఛూట్ మరియు ఇతర ఫారాలు | 1—00 |
| ప్రమాణిత ప్రచారక్ ఫారం ధర | 1—00 |
| మార్కులు లెక్కింపునకు (అంక్ గిన్‌తీ) ప్రతి పేపరునకు | 5 00 |
| కాన్వకేషన్‌కు హాజరై ఉపాధి పత్రము పొందుటకు (శాలువతో) | 40—00 |
| కాన్వకేషన్‌కు హాజరు కాకుండా ఉపాధి పత్రం పొందుటకు. రిజిస్ట్రేషన్ ఖర్చుతో (శాలువ ఇవ్వబడదు.) | 34—00 |

వే. రాధాకృష్ణమూర్తి
ప్రధాన కార్యదర్శి

జ. మార్గబంధు
పరీక్షా సచివ్

